# రేవతి

కర్త

శ్రీ మానాపురం అప్పారావు పట్నాయిక్

# దర్శకులు


కవి
శ్రీ M. అప్పారావు పట్నాయిక్.


సంగీతం
శ్రీ M.S. హరనాథ్.

# తారాగణం


గండికోట


రేలంగి


C.S.R. ఆంజనేయులు


మిస్. సుభద్ర


మిస్. గోవిందమ్మ

ప్రకాశకులు:

యస్. అప్పలస్వామి అండ్ సన్సు

రాజమండ్రి.

## హెచ్చరిక

ఈ నాటకము ప్రదర్శింప దలచిన నాటక సంఘముల వారు నావద్ద లిఖిత పూర్వకమైన అనుమతి పత్రం పొంది ప్రదర్శనములు సాగింపవలెను. లేనిచో నాచే జరుపబడు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులు కాగలరు.

ఇట్లు

మానాపురం అప్పారావు పట్నాయిక్

రాజమండ్రి.

రెండవ ముద్రణ.

కాపీలు 1000.

గౌతమీ ముద్రణాలయము,

రాజమండ్రి.

# రేవతి నాటక ప్రశంస

శ్రీ మానాపురం అప్పారావు పట్నాయిక్‌గారు రచించి ప్రదర్శింపచేసిన 'రేవతి' నాటకమును కన్నులపండువుగాచూచిన తరువాత తెనుగున ఆదర్శప్రదర్శనములు తిరిగి గాంచగలమను నమ్మకం, ఆశ నాకుజనించినది. సంఘసంస్కరణకు పూనుకొన్న వారిలో స్త్రీపునర్వివాహమును, శాఖాంతర పరిణయమును సర్వజన సమ్మతములని ప్రచారముసాగించి సమర్థించినవారేకాని, ఆదర్శ భావములున్నను, పవిత్రజీవితమును గడుపుచున్నను, విద్యావతులైనను గణికాస్త్రీసంతతి వారైనంత మాత్రముననే వారి సంతతిని త్రోసిపుచ్చక సంఘము గౌరవముతో చేయూతనిచ్చి ఆజాతిని లేవనెత్తడానికి కులకాంతలవలె వారుకూడ సంఘ సమ్మతిని వివాహములు చేసుకొనుట అవసరమని చాటిచెప్పగల సాహసవంతులు ఇంతవరకు లేకపోయిరి. ఆభావమునే పురస్కరించుకొని 'లీల' యను పాత్రమూలమున పైయభిప్రాయమును విశదపరచుచు శ్రీకవిగారు గణికా స్త్రీసంతతిలో సహితము సత్యోత్తము లున్నారనియు, వారిని గౌరవభావంతో సంఘ మంగీకరించి ఉదారవంతులు వారిని గ్రహించినప్పుడే సంఘము తన విధిని నిర్వర్తించుకొని పరిణతి చెందగలదని స్పష్టీకరించి సభాసదుల అంగీకారమును సదభిప్రాయమును చూరగొనినట్లు నాటి ప్రదర్శన ఫలితమే చెప్పుచున్నది.

నాటకమున ఆదర్శమునకు పూనుకొన్నవాడు 'మోహనుడు'. సంఘ సంస్కర్తకు కలుగు యిక్కట్లు, వారు మనోధైర్యముతో వాటిని గ్రహించి ఇతరుల సహకారమును గ్రహించువిధానమున కథానాయకుని పాత్ర ఎంతో చక్కగా పోషింపబడినది. ఇదివరలో 'వరవిక్రయం' 'మాలపిల్ల' 'సుమంగళి' మున్నగు ప్రచార

ప్రధాన్యమైన చిత్రములవలె నిదియును సంఘమునకు మార్గదర్శిగా నుండగలదని విశ్వసించుచున్నాను. ఇట్టినాటకములను చిత్రరూపముగ ప్రజల కంద జేసినపుడే ప్రచార బాహుళ్యమునంది తమ ప్రతిఫలమును ప్రజలకీయగల్గును. ఈ విషయమున ఆంధ్రులు శ్రద్ధవహించుట అత్యవసరము.

కవి సిద్ధహస్తుడైన కళారాధకుడు కావుననే నాటకమును ప్రచారార్థము రచించినను ఇతర ప్రచార నాటకములవలెగాక నాటకో చితమైన ఘట్టములు, తదనుసరణమైన హాస్యము, రసమును పోషించు సంగీతము, శ్రవణానంద కరములగు పద్యములను కూర్చి అనేక పర్యాయములు ఈ నాటకమును చూడ నభిలాష కల్గించునట్లు రచించిరి. ప్రతిఘట్టము రానున్న రంగమునకు మార్గము కల్పించి కథాపరిణామమున సభాసదులకు అత్యుత ఉత్సాహము కల్గించుటలో కవి చూపిన చతురత శ్లాఘనీయము. ఇట్టి ప్రదర్శన యోగ్యమైన 'రేవతి' నాటకము తెనుగు రంగమునకు నూతన అలంకారమై వెలయుట మన భాగ్యము.

ఇట్లు,

చిలకమర్రి నరసింహాచార్యులు,

*M. A. B. Ed.*

*Principal*

SANSKRIT COLLEGE, KOVVUR.

# విజ్ఞప్తి

విధి దూరమవడంచేత అవివేకపు బుద్ధితో తుచ్ఛకామానికి గురియై వ్యభిచరించిన స్త్రీని సంఘం బహిష్కరించి శిక్షించడం న్యాయమే అంటాను. కాని- క్రూరబుద్ధితో సంఘం ఆమె సంతతిని కూడ వెలివేసి వేరుపరుస్తూ వారిపాపల భవిష్యత్ జీవితానికి అడ్డుగా నిలచి అధోగతికి దారిచూపుతోంది అంటే ఆ కట్టుబాట్లు మనదేశానికి తీరని అపచారమే అని మనము గ్రహించాలి. ఆ సంతతి బాలికలు ఎంత ఉన్నత కోరికలతోనూ- భావాలతోనూ- ఉన్నత ఆదర్శాలతోనూ ప్రవర్తింప చూచిననూ వారి వివాహాలకు సంఘం చేయూత యివ్వక వారిని తరిమి కులటలగా మారుస్తోంది. తల్లిచేసిన నేరమునకు ఆ బాలికలు శిక్షార్హులు కానేరరని నిరుపిస్తూ ఆ సంతతి స్త్రీలవివాహాలకు సంఘం చేయూత యిచ్చిన వ్యభిచారం నశించడానికి మూలకారణం కాగలదనే సమస్యను పురస్కరించుకొని ఈ నాటకం వ్రాశాను.

ఈ సమస్య నాటకరూపంగా రంగస్థలంమీద ప్రదర్శనములు కాబడి సాధ్యమైనంతవరకు సంఘ సంస్కారంచేయ ప్రయత్నించడమే నా ముఖ్యోద్దేశం.

ఈ నాటకానికి కావలసిన కొన్ని పద్యములను వ్రాయడంలో నాకు సహకార మిచ్చిన శ్రీ పాముర్తి గోపాలకృష్ణశర్మగారికి నా కృతజ్ఞత—

కొన్ని చలన చిత్రాలకు మ్యూజికల్ డైరక్టరుగా పనిచేసి అఖండ విఖ్యాతితోపాటు సంగీత విజ్ఞాన అనుభవమునుకూడ ఆర్జించుకొన్న నా మిత్రుడు శ్రీ M. S. హర్‌నాధ్‌గారు ఈ నాటకాన్ని ప్రదర్శింప చేయడంలో ఎక్కువ కుతూహలమూ పట్టుదల వహించి నన్ను ప్రోత్సాహించారు. నాటకానికి అవసరమయ్యే సిట్యువేష

షన్సులో చక్కని ట్యూన్సుతో పాటలను అమర్చి, తన ఫుల్ ఆర్కెష్ట్రాతో నటులకు విరామములేకుండ ప్రాక్టీసు యిచ్చి ప్రదర్శనములు జయప్రదంగా సాగింపజేసి నాటకం వ్రాయడంలో గల నా ఆశయాన్ని నెరవేర్చినందుకు మిత్రుడు శ్రీ హర్‌నాథ్ గార్కి నా కృతజ్ఞతా పూర్వక అభివందనాలు అర్పించుకొంటూన్నాను.

సి. యస్. ఆర్; గండికోట; రేలంగి; సుభద్ర మొదలగు వారేగాక, కవితాకళానిధి శ్రీయుత బలిజేపల్లి; పులిపాటి సోదరులు; కొచ్చెర్లకోట; శ్రీమతి పూర్ణిమ; శ్రీమతి కళ్యాణి మొదలగు సుప్రసిద్ధ నటీనటులంతా ఈ నాటకమునందు పాల్గొని ప్రదర్శనములు జయప్రదంగా సాగిస్తూన్నందుకు వారికి కూడ నా హృదయపూర్వక అభివందనాలు.

ప్రదర్శన కాలము మూడు గంటలలో ముగియునట్లుగా స్టేజికి అనుకూల పద్ధతులలో సంభాషణలతో పాటు రంగములుకూడ తగ్గించి నా ఈ ద్వితీయ ముద్రణమున ప్రదర్శన యోగ్యములగు కొన్ని మార్పులు చేయడమైనవి.

ఈ నాటక ప్రదర్శనముల విషయములో వేలకొలది పైకమును వెనుదీయకుండ వెచ్చించి నాకు పూర్తి సహకార మిచ్చిన శ్రీమొగతడకల వీర్రాజుచౌదరి, పంతం సత్యం గార్లకు నావందనములు.

ఈ నాటకమున గల గుణములను పాఠకులు గ్రహించి నేను సవరించుకొనవలసిన దోషములుంటే నాకు గాని, ప్రకాశకులకు గాని యెరింగించిన యెడల నా తృతీయముద్రణమున ఆ దోషములు సవరించు కొందునని రసజ్ఞ పాఠకలోకానికి సునవి చేసుకొంటూన్నాను.

రాజమండ్రి
1–7–46

ఇట్లు
మానాపురం అప్పారావు పట్నాయిక్



# నాటక పాత్రలు

## ఇందు నటించిన నటీనటుల పేర్లు

### పురుషులు

మోహన్‌రావు :—కథానాయకుడు

శ్రీ సి. యస్. ఆర్. ఆంజనేయులుగారు
శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణగారు
శ్రీ పులిపాటి లక్ష్మినారాయణగారు

రామశాస్త్రి :—షోకేళ్లా ముసలిధనికుడు

శ్రీ బలిజేపల్లి లక్ష్మీకాంతం కవిగారు
శ్రీ గండికోట జోగినాథంగారు

కేశవరావు :—రామశాస్త్రి గుమాస్తా

శ్రీ పులిపాటి వెంకటేశ్వర్లుగారు
శ్రీ రేలంగి వెంకట్రామయ్యగారు

వెంకటప్పయ్య :—రేవతి తండ్రి

శ్రీ పెమ్మరాజు రామారావుగారు

వాసుదేవరావు :—మోహనుని తండ్రి

శ్యామలాల్ శేట్ :—మదరాసులోని ఒక మార్వాడి

శ్రీ బాబ్జీరావుగారు

### స్త్రీలు

రేవతి :—వెంకటప్పయ్య కుమార్తె

శ్రీమతి దాసరి సుభద్ర.
శ్రీమతి కళ్యాణి

లీల :—మోహనునిచే రక్షింపబడిన అనాథ స్త్రీ

శ్రీమతి పూర్ణిమ
శ్రీమతి పువ్వుల గోవిందమ్మ.

---

ఓమ్

# రేవతి

## ప్రథమాంకము

### 1వ రంగము

[స్థలం తోటగా సూచించుటకు సైడ్సులోనుంచి చెట్లకొమ్మలు స్టేజిమీదకు కనబడునట్లుగా వంగిఉంటాయి. పదహారేండ్లు వయసు కలిగిన రేవతి జామికాయలు కోసుకొనుటకు వెదురు గడతో ప్రవేశించి, కాయలుకోయుట అభినయిస్తూ చెట్టుమీది కోకిలనుచూచి పాడుతుంది. మోహన్ బిళ్ళగోచీ పంచెతోనూ, కళ్ళిల షర్టుతోనూ ఆస్థలానికివచ్చి చట్టున ఓ నిమిషం ఆగి ఆమె దగ్గరకు నడుస్తాడు. వయసు యిరువై సంవత్సరాలు.]

#### 1 వ అనుబంధం డైలాగ్

మో :—[రేవతిని సమీపిస్తూ]

ఉ. తీయనికంఠమెత్తి వెనుదీయక పాడవదేల ! బేలరో !
కూయని యూరకే సణుగుకో ఫలమేమి ? మదీయప్రేయసీ
గాయకి మాళినంచుకదు గర్వమ ? నాహృది వీణతంత్రులన్
ప్రోయగ ప్రేమగీతిక లమోఘరసోచిత వానినింపవే.

[రేవతి మోహనునిచూచి పెదవులమీద చిఱునవ్వు యుగు పర్చి దృష్టిమరల్చుకొంటుంది] రేవతిగారితో మాట్లాడ వేచియున్నాడీ మోహనుడు.

రేవతి :—ఓ ! దయచేశారా ?

మో :—జీ హాఁ !

రే :—ఎంత సేపయింది తమరు దయచేసి !

మో :—అసలు నిలువడమే తెలియకుండ నిలచిపోయాను. ఒయము గుర్తించటానికి కూడ మనకు వ్యవధి ఎక్కడిది !

రే :—అంటే ! అంత విస్తుపోవలసిన కారణం ఏముంది !

మో :—చెప్పనా ! నీజుట్టులో నా మనస్సు చిక్కుకొనేటంత నేర్పుగా ముడివేశావ్. నీ నల్లని తల అందం...

రే :—ముడిని చూస్తూ మూర్ఛ పోతూన్నారన్నమాట !

మో :—అంతేనా ! నీ అందాన్ని దోచుకోవాలనె తృష్ణ నాలో పనిచేసి బలవంత పరుస్తూ బాధిస్తోంది. రేవతీ ! ఒక్క నిమిషమైనా ఆగకుండ పరుగెత్తుకొని పోతావ్ గదా ! నీ ఎడబాటుతో నా హృదయం బాధతో ఎంత గిలగిల కొట్టుకొంటుందో తెలుసా ?

రే :—ఆ ! పాపం ! సాయంత్రాలు రాత్రులు గాకుండ సాయంత్రాలుగనే ఉండరాదూ !

మో :—ఆ సూర్యచంద్రులమీద నేపం వెయ్యకపోతే, రాత్రి అయితేనేం ! ఉండకూడదూ !

రే :—మా నాన్నగారికి తెలుస్తే !

మో :—ఊ తెలుస్తే ! ఏమి జరుగుతుందేం ! ఆ వెంటనే వివాహ ప్రయత్నాలు చురుకుగా జరుగుతాయి.

రే :—అబ్బో ! వివాహాలు ఆమాత్రంలోనే జరిగిపోతాయా ! పెద్ద కట్నాల్నియిచ్చే అమ్మాయిని కట్టబెట్టి ఊరుకొంటారు మీనాన్నగారు. అప్పుడు పీటలమీద ఉన్న తమని 'ఏమండీ మోహన్ గారూ!' అంటే 'ఎవరండిమీరు!' అంటారు [హేళనగానవ్వుతుంది]

మో :—[బుగ్గమీద చిటికెవేస్తూ] ఎప్పుడూ అలా అనవుకదా ! ఈ మా రేవతి తప్ప మరియొకతె నాకు భార్యకాడానికి అవకాశం లేందే ! రేవతీ ! చెప్పడం మరిచాను. నేను ఒక్కణ్ణే ఏకాంతంగా కూర్చుంటే నీధ్యానంలోనే తేలుతూ అసలు అంత అందంగా నిన్ను పుట్టించడంలో ఆ సృష్టికర్త ఉద్దేశం ఏమిటా ? అని ఒకటే యోచన.

రే :—నీకోసమే ! [వారగాచూచి నవ్వుతుంది]

మో :—ఐతే నాయిష్టాన్ని చెల్లించు—ఇదిగో ఒక్క...[దగ్గరకు వెళ్ళబోతాడు]

రే :—[నవ్వుతో తప్పించుకొని] పెద్ద చదువు చదివేనని- మంచి మాటలు మాట్లాడగలనని గర్వం!

మో :—అంత కళ్ళున్నాయికదా అని బడాయి !

రే :—అంత నోరు ఉందిగా !

మో :—ఇదివరకు చిన్నదే! ఈమధ్యనే అరిగి యిలాతయారయింది.

రే :—ఎందుకో ?

మో :—చెప్పనా ? [దగ్గరగా వెళ్ళబోతాడు]

రే :—[దూరంగా పరుగెత్తి] పోదూ !

మో :—ఇదిగో !

రే :—ఎక్కడ నేర్చేవు మోహన్ ఈ కొంటెమాటలు ? ముద్దువలె- పాటవలె నీ ప్రతిమాట నా చెవినితాకి......

మో :—రేవతీ ! మధురతలపులు నాలో మొలకలెత్తుతూ కలవర పరుస్తూన్నాయి. మెరసే నీ కండ్లవైపుచూస్తో నీ చేతుల మధ్య నా జీవితం దొర్లిపోతే—

రే :—[అతని చేతి వ్రేళ్ళనుగోముగావ్రాస్తూ] మోహన్ ! నిజంగా నన్ను ప్రేమిస్తూన్నావా ?

మో :—ఆ ! నా ప్రాణమంతటితోనూ ప్రేమిస్తూన్నాను.

రే :—నా తండ్రి ధనవంతుడు కాకపోవడం మన వివాహాటంకానికి కారణం అవుతుందేమో !

మో :—ప్రేమకీ ధనానికి సంబంధం ఏమిటి ? నే వివాహమాడ దలచింది నిన్ను కాని— నీ భాగ్యాన్ని కాదుగా !

రే:—అందుకు నీ ముసలి తండ్రి ఒప్పుకొంటాడని నమ్మకం ఎక్కడిది!

మో:—ఉష్! వివాహమాడేది నేను గాని ఆయన కాదని నీవు తెలుసుకోవాలి. అయినా మా నాన్నగారట్టివారు కాదే! నా యిష్టమే వారి యిష్టముగా చూచుకొంటారు.

రే:—[కొంటెగా చూస్తూ] మీరే ఎదురుతిరుగుతే!—

మో:—నిన్ను వదలి బ్రతుకగలనా? ఇట్లా చూడు!— నీ చిన్న చిరునవ్వులకీ—నీ క్షణిక కోపాలకీ— నీ బంగారు కణికల్లాంటి మెత్తని వ్రేళ్ల (Little vibrations) లిటిల్ వైబ్రేషన్సుకీ ఎదురు తిరుగగలదా ఈ లేత హృదయం!

రే:—మోహన్! నీవేనా ప్రేమమూర్తివి. నీవు నాకు ద్రోహం చేయవని పూర్తిగా నాకు తెలుసు. నిండు హృదయంతో నిన్ను నాలో ఆరాధించుకొంటూన్నాను. నా హృదయాలయంలో నీ నవయౌవన దివ్యసుందర విగ్రహాన్ని ప్రతిష్ఠించి, నా ప్రణయ వనంలో పుష్పించిన ప్రేమ కుసుమములతో పూజిస్తూ, నీకు ప్రియభార్యను కావడానికి వేయి దేవుళ్ళను ప్రార్థిస్తూన్నాను.

మో:—[ప్రక్కనున్న రాతిమీద కూర్చుండగా రేవతి ఆతని పాదాలచెంత కూర్చుంటుంది.] రేవతీ! ఒక్క విషయం నీతో చెప్పడానికి వచ్చాను. కాని— నాకా ప్రయాణం నిన్ను చూచిన ఈ క్షణంనుంచి తప్పించుకొనే...

రే:—[ఆతృతతో] ప్రయాణమా? ఎక్కడికి! ఎందుకోసం!

మో:—బి. యే. పేసయి యింటిలో కూర్చుంటే ఏమిలాభం? అందులో మన బ్రహ్మిగాళ్ళకి ఈ రోజులలో ఉద్యోగం ఆశ పూర్తిగా నశించిపోయినట్లుగా. ఆ కారణంచేత బి. యల్. సీటు

కోసం నాన్నగారి పట్టుదలమీద ఎప్లయిచేయగా సీటుయిచ్చినట్లు ఈదినమే ఉత్తరం వచ్చింది. వెంటనే జాయిన్ కావాలని కూడా ఉంది దానిలో.

రే :—[అసంతృప్తితో] పట్నానికేపోవాలా ?

మో :—ఆ ! మరల సెలవులలో మధ్య మధ్య మనఊరు వచ్చిపోతూ వుంటానుగా!

రే :—మోహన్ ! నిన్ను చూడకుండ, నీమాటవినకుండ ఏలాకాలం గడపడం ? తప్పదా ?

మో :—ఏమిచెయ్యను ? అది నాన్నగారి కోరిక. పేసయి తిరిగి రావడంతోనే మనవివాహం జరుగుతుంది. నమ్ము-నామాటనమ్ము. నీవే నా ప్రియభార్యవు.

రే :—మోహన్!- నేను నీయండ లేకుండ పోచూస్తూన్నావా?-

మో :—ఆకాస్తా పేసయిఊరుకుంటే పార్టీలు మనకాళ్ళదగ్గరకువచ్చి, డబ్బిచ్చి పోతూంటారు. అప్పుడు మన జీవితంలో అధికార గౌరవం కూడా యేర్పడి—

రే :—మోహన్ ! ఆపట్టణ వాతావరణంలో నేను నీకు జ్ఞప్తికి ఉంటానా ? నన్ను దినమునకు ఒకసారి అయినా తలుస్తూంటావా ?

మో :—(ఆమె తల నిమురుతూ) పిచ్చిదానా !-

శా. ఏనాడో భవదీయమైయలరి, నా నెమ్మానస మ్మెప్పుడున్
నీ నామమ్మె దలంచు వేయిగతులన్, నీ రూపమేమెంచెడిన్
నే నేసీమల విద్యకై యరగినన్ నీకేమి ? నిన్వీడి తా
రానేరాదుగ నాదు మానసము ; చేలా ! యేలవాపోదువే ?

నాగుండెను కలచివైచి, నా నరాలను బిగబట్టి పిండే నీ చూపులు మరచిపోగలనా ? నీవు నాదగ్గర లేని ఒంటరి జీవితం అక్కడ

ఏలా గడపగలనా అనే యోచనలు నా ప్రయాణాన్ని అడ్డు పరుస్తున్నాయి.

రే :—మోహన్ ! తిరిగి వేగం రావాలి. నీ ప్రయాణానికి నేను అడ్డుపరచను. నీకోసం ప్రతి నిమిషం ఎదురుచూస్తూంటాను. నన్ను మరువవనికూడ నమ్ముతాను.

మో :—నీ తియ్యని మాటలకంటే ఎక్కడా ఏసుఖము నన్ను మధురపర్చలేవు. నిన్ను ఏలా మరువగలుగుతాను ? గులాబి గోవా చూచినప్పుడల్లా మధురమైన నీబుగ్గలు జ్ఞప్తికి వస్తాయి. ఆ తలపుతో నాచదువు చెడి పుస్తకాన్ని మూసి మా రేవతిని తలుచుకుంటూ...

రే :—మోహన్ ! ఎప్పుడు నీవు వెళ్ళడం ?

మో :—రేపు తెల్లవారుగట్ల బండిలో.

రే :—మీ ప్రియ రేవతిని మరువకండి. మీకోసం నిలువుగుడ్లతో ఎదురుచూస్తూ వుంటుందని జ్ఞప్తిని పెట్టుకోండి.

మో :—రాణీజీ ఆజ్ఞ శిరసావహిస్తున్నాం. ఇకనే వెడతా ? రేపు ప్రయాణం అని తెలిసిన నా స్నేహితులు నాకోసం ఎదురుచూస్తూ ఉంటారు. [అంటూ ఆమె బుగ్గమీద చిటికవేసి నిలుస్తాడు.]

రే :—[వారచూపుతో] జ్ఞాపక చిహ్నంగా మీ ఖర్చీఫ్‌ను ఇచ్చిపొండి. [అంటూ మోహన్ జేబులోని ఖర్చీఫ్‌ను తీసుకుంటుంది.]

2 వ అనుబంధము—డైలాగ్



# 2వ రంగము

[ హాలులో సోఫాలు కుర్చీలు అమర్చబడి వుంటాయి. అరువది సంవత్సరముల వయ గల రామశాస్త్రి టేబులుమీది పెద్ద అద్దముముందు కూర్చుని మీసాలు సవరించుకుం ఉంటాడు. పాతిక ఏండ్లుగల గుమాస్తా కేశవరావు తలపాగాను సవరించుకుంటూ రికార్డు గదిలోనికి వస్తాడు.]

కే :—[వెనుకనుంచి భయాన్ని నటిస్తూ] ఈ కాగితాలు మీా తమ దస్కత్తులు అవసరమండి.

రా :—[అద్దమునుండి దృష్టి మరల్చకుండా] ఊ-ప్లీడరుగార్ని కలు కొని ఆదావా విషయం మాట్లాడేవా?

కే:—చిత్తం. మాట్లాడేనండి.

రా :—ఏమన్నాడు? గెలువడానికి అవకాశాలు ఉన్నాయన్నాడా

కే :—అన్నారండి. పాతబాకీ, ఇప్పుడు ఫైలు చేయవలసిన దా తాలూకు స్టాంపుడ్యూటీ, వ్రాత ఖర్చులు వెంటనే ప మన్నారండి.

రా :—వేశ్యల తలదన్నేస్తున్నారు ఇప్పటి ప్లీడర్లు. నిర్ణయం ఒక గుంజుకోవడం వేరొకలాగ. దిగేవరకూ ఒకమాట. దిగిన వాత బిర్రబిరుసు. సంసారాలను తినివేస్తున్నారురాబాబు! లోకంలో యములంటూ వున్నారంటారు. అదినిజమో అబద్ధ తెలియదుకాని యీా ప్రత్యక్ష ప్లీడరీ యముల బాధనుంచి తప్పి కోవడం మాత్రం మహాదుస్సాధ్యంగా ఉంది.

కే :—తమబోటి లక్షాధికారులే అల్లాఅంటే ఇహమాబోటి...

రా :—[కోపంతో] లక్షాధికారులైతే వాళ్ళనందర్నీ పెంచ టోయ్ నీ అభిప్రాయం.

కే:—[జంకుతూ] ఉఁహూఁ! కాదండి.

రా :—ఆ కాగితాలు ఇటు తే [ఆకాగితాలు తీసుకొని సంతకాలు చేస్తూ ఉంటాడు]

కే :—[చేతులు నలుపుతూ] బాబూ! ఆ నల్లరంగు తెచ్చేసాహేబు ఎంతమాట అన్నాడో విన్నారా? ఆమాటతో నాఒళ్ళుమండి ఒక్క లెంపకాయి వేసేను.

రా :—[ఆతనివంక చూడకుండానే] ఆ మీసాలరంగు సాహేబేనా? ఎందుకు కొట్టడం?

కే :—గుమ్మంలోనికివచ్చి వీధిలో అందరూ వినేటట్టు "శాస్త్రితాత గారు ఉన్నారా" అన్నాడు.

రా :—[చట్టున తలఎత్తి] ఆరి వీడి తలనరకా! అమాంతంగా అలా అన్నాడేం! మంచి పనిచేసేవ్! [చిన్న గొంతుకుతో] వీధిలో ఇరుగు పొరుగు ఆడవాళ్ళు వినలేదుకదా!

కే :—అప్పుడే నీళ్ళకు వెళుతూన్న ప్రక్కఇంటి శాంతమ్మగారు, ఇంకా కొంతమంది విన్నారు.

రా :—అరే! తుంటరి వెధవ! ఎంతమాటనిపోయేడు! నేనుంటే నిలువునా చీల్చి ఎండవేసివుందును. [అద్దములో మరల చూస్తూ] అయితే కేశవా! నాతలలోగాని, మీసాలలోగాని పండు వెంట్రు కలు పబ్లిక్‌గా కనబడుతూన్నాయంటావా?

కే :—మీరు ఆ లేహ్యాంతిని ఆరంగు వ్రాస్తున్నప్పటినుంచి అంతగా కనబడడం లేదండి. మీరు వెంట్రుకల విషయంలో చాలా స్పెషల్ కేర్ తీసుకోవాలి.

రా :—ఉదయం మంచంమీాదనుండి లేవడం తోనే కాఫీకంటె ముందుగా రంగు పెయింటు చేయడమేగా మన నిత్యకృత్యము లలో మొదటిది. [మరల కాగితాలుచూస్తూ వుంటాడు]

కే :—[చేతులు నలుపుతూ] కోటమ్మగారు నిన్నసాయింత్రం మన

భవనం వైపుచేతులుచాచి అనరాని మాటలు అంటూ శపిస్తోందండి.

రా :—[తల ఎత్తకుండానే] ఏం! ఎందుకు వేసింది రంకెలు !

కే :—ఆమె కోడలు అన్నపూర్ణ వైపు మీరు విడువకుండా చూచేరట. ఒలచి ఒళ్ళోపడతారన్నట్టు చూస్తావు 'ముసలిగాడిద' అని ఏమేమో అందండి.

రా :—[నెమ్మదిగా తల ఎత్తుతూ] బుద్ధిలేని మనిషోయ్ కోటమ్మ. దానికోడలు నావైపు తదేకదృష్టితో విడవకుండ చూడకపోతే నేను చూచినట్లు ఆమెకు మాత్రం ఎలా తెలుస్తుందోయ్ !

కే :—చిత్తం! సౌందర్యం ఒకరికాపీరైటు కాదన్నవిషయం ఆ బ్రూట్ కేంతెలుసు ! ఫ్రీలవ్ సొసైటీ మెంబర్సును అడిగి తెలుసుకోవాలన్న జ్ఞానమైనా లేందే !

రా :—[నిరసనతో] మనం కోరకే పోవాలిగాని, కోరేమంటే అర నిమిషంలో ఆపిట్టను ఇక్కడకు రప్పించను! ఆకోటమ్మ రంకెలేగాని అన్నపూర్ణ మాత్రం మన విషయంలో రైటే. ఒకరి ఇష్టాలతో పనేమిటోయ్ మనం తెలుచుకుంటే! అసలు అన్నపూర్ణకే ఇష్టంలేకపోయినా మాయచేసి మన చేతిలోనికి రప్పించ గలశక్తి మనలోఉంది.

కే :—చిత్తం. [తనలో] నాకు తెలుసుగా! బ్రహ్మచెముడు రకంలవ్వండి మనవాడిది. మొండిజాతి ఎన్నిసార్లు చంపినా చావదు.

రా :—అడగడం మరచేను. వెంకటప్పయ్య మనయింటికి వచ్చేడా?

కే :—అబ్బే—రాలేదండి. ఆరిజిష్టరీ ఉత్తరంతో గిర్రని పరిగెత్తుకొని వస్తాడనుకున్నాను. (యోచనతో) ఉన్నఆస్తికంటే వడ్డీతోసహా తణకా ఆస్తే ఎక్కువలా కనబడుతూంటే మళ్లీ మూడు వందలు రొఖ్ఖం అతనిచేతి కందించే రెందుకండి? మళ్ళీ ఆడబ్బు ఎలా రాబట్టుకొందామని !

రా :—అంతేనా ? రామశాస్త్రిగారిని అంత తెలివి తక్కువగా భావిస్తున్నావా ? [నవ్వుతూ] దానికి అంతా లెక్క ఉందిలే.

కే :—ఎన్ని లెక్కలు కట్టినా ఆ డబ్బు తిరిగిరావడం సున్న. మీ దగ్గర వున్న తణకా ఆస్తే మీకు దక్కేది.

రా :—వెధవ ఆస్తి! దానికోసమటోయ్ అడిగినప్పుడల్లా కోరిన పైకం అతని కిచ్చేది ? ఆ డబ్బు వచ్చినా ఇక ఇవ్వలేదు. అంచేతనే నా కోరికలు నెరవేరడానికి అవకాశాలున్నాయని ఆశించడం.

కే :—[తనలో] దొంగముండాకొడుకు ఏదో పెద్ద ప్లానే వేశాడు ! లేకుంటె పిల్లికి బిఛ్చంపెట్టని వీడా అంతడబ్బు ఇచ్చేది ఆ బ్రాహ్మ డికి. [ప్రకాశంగా] తమరుచెప్పేది నాకు అవగాహన కాలేదండి.

రా :—చూస్తావుగా ! నీకు అర్థంకాదులే ! సరే. [టీవిని నటిస్తూ] అయితే వెంకటప్పయ్య కుమార్తె రేవతి అనేపిల్ల—మనకు ఎలా వుంటుందోయి ?

కే :—అచ్చు కుమార్తెలానే వుంటుందండి.

రా :—[కోపముతో] ఏడిశావ్ ! బుద్ధిలేనిమాట్లాడతావ్ !

కే :—చిత్తం—పొరపాటండి ! కోడలిగారిలా వుంటారండి.

రా :—షటప్ ! కొడుకేలేంది కోడలేంటోయ్ !

కే :—[తడబడతూ] అదేనండి. కొడుకుండినట్లయితే కోడలిగారిలా వుంటారండి.

రా :—అదేవద్దన్నాను. నీవు బుర్రలేని మనిషివోయ్ ! [కంఠము మార్చి] ఆమె నాప్రక్కవుంటే జోడా బాగుంటుందటోయ్ !

కే :—[తనలో] ఆఁవీడి ముండామొయ్యా ! కొంపతీసి ఆ పిల్లను పెండ్లిచేసుకుంటా ననడుగదా !

రా :—ఏమిటోయ్ అలా ఆలోచిస్తున్నావ్ ? ఆ పిల్ల బుద్ధిమంతురా లని చాలామంది చెప్పడంచేత ఆమెనే వివాహమాడదలచేను.

కే :—ద్వితీయ వివాహానికి ఈవయసులో పిల్లనివ్వడానికి వెంక టప్పయ్య ఒప్పుకుంటాడంటారా?

రా :—మహారాజులాగు ఒప్పుకుంటానంటాడు. ఒప్పుకోకపోతే ఫకీరవుతాడు. ఆతని జీవితం అంతా మనచేతిలో ఉంది. రేవతినిచ్చి పెండ్లిచేస్తే తణకా ఆస్తి అంతా ఆతని పరంచేస్తా నంటాను. లేదా—ఇవ్వవలసిన బాకీ క్రింద ఆతని ఆస్తి స్వాధీన పరచుకోవడం కాకుండా ఇవ్వవలసిన దానికి కూడా దావాచేసి, వాడినికోర్టుకి రప్పించి—ముప్పతిప్పలూపెట్టి— మూడు చెరువుల నీళ్ళు త్రాగించి—

కే :—చిత్తం! బలే వలపన్నేరండి. లేడి దానిలో చిక్కుకున్న దన్నమాటే!

రా :—[సంతోషముతో] చిక్కుకోవడమేమిటోయ్! ఇక కదల లేదు. ఆ రేవతి మన భార్యని నమ్మవలసిందే!

కే :—[సందిగ్ధంగా] మనభార్య ఏమిటండి! నా భార్య అనండి.

రా :—[కోపంతో] నీభార్యా?

కే :—[తడబడుతూ] అహఁ! అదే— నాభార్యని తమరు ఉచ్చ రించాలి.

రా :—నీభార్య అని నేను ఉచ్చరించాలా?

కే :—చిత్తం— కాదండి—

రా :—ఛీ!—మాట్లాడడం కూడా రాదునీకు!

కే :—చిత్తం.

రా :—[కోపంతో] నీ మొహం! పో! నీ పని చూసుకో!

కే :—[రెండడుగులు ముందుకువేసి వెనుకకు తిరుగుతూ] శాస్త్రి గారూ! వెంకటప్పయ్య మామగారు వస్తూన్నారండి తమ దర్శనానికి.

రా :—[కోపంగాచూచి] నీకూ మామగారేనా ఆయన?

కే :—చిత్తం— కాదండి— తమ మామగారేనండి.

రా :—[అద్దములో మీసాలు తొందరగా సర్దుకొని, జరీకండువా సరిచేసుకుంటూ] ఊఁ! సరే-నీవు నీ ఆఫీసు పనులు చూసుకో! ఆయన్ని మాత్రం లోనికి ప్రవేశపెట్టు.

కే :—[ముందుకు నడచి తనలో] ఆ రేవతితోనే వివాహం స్థిర పడిందంటే, ఆ సంతోషంతో రెండు పల్టీలుకొట్టి ఒక్క వెంకి పాట పాడతాడనుకుంటాను. [నిష్క్రమించును]

[ వెంకటప్పయ్య ప్రవేశము ]

వెం :—శాస్త్రిగారూ ! నమస్కారమండి.

రా :—ఓ ! వెంకటప్పయ్యగారా ? రండి. ఇలా దయచెయ్యండి. ఏదో దారితప్పి వచ్చినట్లున్నారు ?

వె :—ఎంతమాట ! దారితప్పి రావడంకాదు. - దారి తెలుసు కొనే తమ దర్శనానికి వచ్చేను.

రా :—ఏదో విశేషము ఉండిఉండాలి. [జ్ఞప్తికివచ్చినట్లు నటిస్తూ] ఓ! మా గుమస్తా ఇచ్చిన రిజిష్టరీ నోటీసుగురించి మాట్లాడ డానికి వచ్చేరనుకుంటాను.

వె :—చిత్తం. నాయందు వారముగోజులక్రిందట దయచూపి మూడువందలు అప్పుయిచ్చిన మీరు ఈరోజున యిలాగురిజిష్టరీ నోటీసు ఇచ్చేరూ అంటే...

రా :—ఏదోలెండి...నలుగురికీ ఇచ్చినట్లు మీకూ ఇచ్చియుం టాడు కేశవుడు. వాయిదా దాటితే అలాగు వ్రాయడం మామూలు ఆకారణంచేత ఆతడు వ్రాసియుంటాడు.

వెం :—అప్పుడే అనుకున్నానులెండి తమకీ విషయం తెలిసియుం డదని.

రా:—[ఆలోచన నటిస్తూ] అయితే వెంకటప్పయ్యగారూ! నాకు తెలియక అడుగుతాను ఈ నాలుగువేల పై చిల్లరబాకీ అంతా ఎలా చెల్లిస్తారండి? మీకు ఉన్న ఆస్తికంటె అప్పే ఎక్కువగా కని పిస్తోంది. ఆకాస్తా అప్పుకోసం తుడుపు పెడితే తమముందు జీవితం!

వె:—ఏమిచేస్తానండి! ఆ బడి జీతం పదునెనిమిది రూపాయలతో గడవడం చాలా దుర్లభంగాఉంది. ఈ అప్పునుగురించే మతి పోతూంది. నా భార్యకు కాళ్ళచురుకులు తగ్గనేలేదు. ఇప్పటికీ మంచంమీదపడి అలా ఉంటూనేఉంది. డబ్బులేక వైద్యం కూడ మానిపించివేశాను. నాస్థితి చాలాకష్టంగా ఉందండీ శాస్త్రిగారూ! ఏమిచేయను?

రా:—అవునుపాపం! మీ అమ్మాయికికూడ పెండ్లి ఈడువచ్చింది. ఇంతవరకు మీరు పెండ్లి ప్రయత్నమైనా చేస్తూన్నట్లు కనబడదు. ఇహాముందు...

వె:—ఆ విచారంకూడా నన్ను దహిస్తూంది. అన్నిటికి ఆ భగవంతునిమీదే భారంవైచి కూర్చున్నాను.

రా:—బాగుంది! చెప్పడం మరచాను. వెంకటప్పయ్యగారూ! నాకు కావలసినంత డబ్బుఉంది. నా తరువాత అనుభవించే వారు కనబడరు. నా తరువాత నావంశం అంతరిస్తుందని భయంగాకూడవుంది. ఆ కారణంచేత అందరూ, నన్ను పెండ్లి చేసుకోమని బలవంత పరుస్తున్నారు. ఆ భార్యవల్ల ఒక్క ఫలం కలుగుతే నావంశం నిలబడడానికి అవకాశం కలుగుతుంది. అప్పటితోగాని నాచింత తొలగిపోదు.

వె:—[ఆశ్చర్యంగా] మీకు యీ వయస్సులో వివాహమా? ఎవరిస్తారండీ పిల్లని?

రా :—ఏం! నావయస్సు ఎంత ఉంటుందేం? బలేవాడివి! సంరక్షణ లేక యిలా కనబడుతున్నాను. నాకు ముప్పదిఐదుకి ఎక్కువ వయస్సు ఉంటుందంటావా? మొదటి భార్య పోవడంతోనే విచారములు పంటబట్టి యిలా తయారయ్యాను. నీకు మాత్రం తెలియదేం! అన్ని విధాల జరిగేవాడికి ముసలితనం ఏమిటండి! అట్టివారికి ముసలితనంలో కూడా యవ్వనం వస్తుంది. తినడానికే లేని వాడికి యవ్వనంలోనే ముసలితనం వస్తుంది. తెల్లగా గుడ్డలేసుకొని తిరుగుతే చాలంటారా? గట్టిగా గాలి వేస్తే కనబడరు. ఇరువై ఏండ్లు దాటేటప్పటికే నరాలబలంతగ్గి ఇప్పటివారు...

వె :—చిత్తం...నిజమే లెండి! ధనమే యౌవ్వనం-ఉత్సాహం-ధైర్యం చేకూరుస్తుంది. పిల్లకోసం ప్రయత్నములు సాగిస్తూన్నారా?

రా :—చాలమంది యిస్తానంటూన్నారు. కాని అందచందాల్లేన్ని ఆ పిల్లల్ని చేసుకోవడం నా కిష్టంలేదు- నేను కోరితే ఎవరు మాత్రం యివ్వనంటారు? అహా! మిమ్మల్నే కోరాను అనుకోండి. మీరు వద్దనగలరా?

వె :—[గతుక్కుపడి] నేనా?—చిత్తం...

రా :—వెంకటప్పయ్యగారూ! నేను ఒక్క సంగతి చెపుతాను వినండి. మీరూ బీదవారు. మీ అప్పులు చెల్లించుకోడానికి మీకు త్రాణ చాలదు. మీ ఆస్తికాస్తా అప్పుకోసం ఆహుతి యిస్తే మీ ముందు జీవితం దుర్భరమౌతుంది. ఆలోచించండి. మీ అమ్మాయి చాలా బుద్ధిమంతురాలనీ- నాకు తగిన భార్య కాగలదని చాలామంది నాకు చెప్పుతున్నారు. ఆ అమ్మాయిని నాకిచ్చి వివాహం చెయ్యండి. మీ ఆస్తి అంతా మీపరం చేస్తాను. నా ఆస్తికి మీ కుమార్తె హక్కుదారిణి అవుతుంది.

వె :—[తనలో] నా ఆస్తికోసం, నా సౌఖ్యంకోసం దాని జీవితాన్ని ఏలా బలియివ్వగలను ? ఒక్కగాని ఒక్కకూతురు. అల్లారు ముద్దుగా పెరిగింది.

రా :—ఏమయ్యా మాట్లాడవు ? ఆలోచించండి. మీ క్షేమం యోచించి చెపుతూన్నాను. కట్టుకున్న భర్త మంచివాడు కాకపోతే రేవతి బాధ్యతకూడ మీ మీదపడి మీ హృదయాన్ని మరింత వ్యాకులపరుస్తుంది. ఈ లేమిలో ఆమెకు తగిన భర్తను కట్టబెట్టలేరు. ఎవడూ కట్టుకోన సాహసించడుకూడ.

వె :—ఇంటిలో మా వాళ్ళతో యోచించకుండ మాటయివ్వలేను.

రా :—ఆలోచించండి. నాకంటె మంచి సంబంధాన్ని తెచ్చి మీరు కట్టబెట్టలేరు. మీ శ్రేయస్సుకోసం కూడ యోచించుకోండి. అలా కాదంటారా— నా అప్పు కాస్తా తీర్చివేసి మీ యిష్టం...

వె :—తొందరపడకండి. మా వాళ్ళతో యోచించి చెపుతాను. ఆ పిల్ల యిష్టంకూడా తీసుకోవాలిగా !

రా :—పిల్లలకేమి తెలుస్తుందండి బాధ్యత ! ఇప్పటి పై మెరుగుల్ని చూసి తెల్లచొక్కా వేసుకొన్నవాడ్ని కావాలంటె, వాడికి కట్టబెట్టి ఆమెకు రాబోయే కష్టాల్ని తిలకిస్తూ నోరు తెరచి ఊరుకొంటారా ? మీరు నచ్చచెపుతే వినక ఏమిచేస్తుంది ? వివాహవిషయాల్లోనే ఫకీరు లవుతున్నారు ఆడపిల్లలను గన్న తల్లి దండ్రులు. నేను చెప్పినట్లుగా నాతో సంబంధం చేయడానికి మీకు యిష్టం లేకపోతే నా బాకీ వెంటనే చెల్లించడానికి సిద్ధంగా కూడా ఉండాలని హెచ్చరిస్తున్నాను. మీ మీదనున్న అభిమానంకొద్దీ ఎందరు పిల్లల్ని యిస్తామన్నా త్రోసిపుచ్చి మీ రేవతినే వివాహ మాడుతా నంటూన్నాను. ఆలోచించండి.

వె:—చిత్తం. నాకర్థమైంది. నామాట నిశ్చయంగా ఒకటి, రెండుదినములలో తెలియచెపుతాను. తొందరపడకండి.

రా:—సరే...యోచించండి...మీ అమ్మాయి విషయంలో ఏచింతాలేకుండా నిర్విచారంగా మీరుండడమే కాకుండా మీరు ఋణవిముక్తులు కాడానికి ఇది పెద్ద అవకాశం. నాతరువాత ఆ స్తికి హక్కుదారిణి రేవతి అవుతుందంటే కొంచం యోచించండి. ఫలానా రామశాస్త్రిగారి మామగారంటే మీకు గౌరవమే! ప్రతివాడు చేతులెత్తి నమస్కరించవలసిందే. మీ కుటుంబ గౌరవంకూడా హెచ్చుతుంది. గట్టిగా యోచించండి.

వె:—అలాగేలెండి. ఒక్క రెండుదినములు గడువిస్తే మీకువచ్చి తెలియపర్చుకుంటాను.

రా:—ఊ!...కానివ్వండి. ఈసిట్యుయేషన్‌లో పరిస్థితులనుగుర్తించి పనులు జరపండి. ఆవిషయం మీ ఆవిడిగార్కికూడ చక్కగా తెలిసేలాగు నచ్చచెప్ప శుభస్యశీఘ్రం అనిపించండి.

వె:—[లేస్తూ] ఇనూనాకు సెలవు ఇప్పించండి. నేనుకూడ శక్తివంచన లేకుండా మావాళ్ళకు నచ్చచెప్పి 'ఊ' అనిపించడానికి అన్నివిధాల ప్రయత్నించేస్తాను.

రా:—అలాగుగట్టిగా అనాలి. ఆమాట నాకుచాలు. మీ మర్యాద మీ సత్యసంధత— మీ వాక్పరిపాలనా నాకు పూర్తిగా తెలుసు. ఒక్కమాట అన్నారంటే ఆమాటమీదనే నిలుస్తారని నాకు నమ్మకమే...

వె:—నాకు శెలవు ఇప్పించండి. రిజిష్టరీ ఉత్తరం గూర్చి మీగుమస్తాగార్ని కనుగొనండి. వారు తొందరపడి దావాఫైలు చేయకుండా చూడండి.

రా:—అహ...మీారుతిరిగి ఏదోమాట చెప్పేవరకు అపుదల చేయి స్తానులెండి—ఊ!...అంటే తమరు ఎల్లుండి బుధవారం దయచే స్తారన్న మాటేగా?

వె:—అలాగేనండి. ఇహ శెలవు.

రా:—చిత్తం.

[వెంకటప్పయ్య నిష్క్రమించును]

రా:—[కుటిల నవ్వుతోలోనికి చూచి] మిష్టర్ కేశవరావుగారు! ఇలా ఒక్కసారి రండి. ఊ!—జరూర్!

[కేశవరావు ప్రవేశము]

కే:—[తనలో] పీడిగొట్టి నేతిలో పడినట్టుంది. అందుకే ఆఒళ్ళు తెలియని సంతోషం. ఏదైనా ఎరవేశాడంటే ఆచేప పడేవరకు నిద్రపోడుగదా ముండాకొడుకు. ఈఎత్తుకోసమే ఆ బ్రాహ్మడికి అంతసొమ్మిచ్చేడు. ఏమిటో అనుకున్నాను.

రా:—[అద్దంపైపునుండి ముఖంత్రిప్పుతూ] వచ్చేవా? ఇలారావోయ్! చూసేవా! వెంకటప్పయ్యను త్రోవలోనికి ఏలారప్పించేనో?

కే:—ఏమన్నాడేం! రేవతినిస్తానన్నాడా!

రా:—ఇవ్వకేం చేస్తాడోయ్! లేకుంటే ఫకీరవుతాడు. కను క్కొనివచ్చి చెప్పుతానన్నాడు. ఆతని మాటలబట్టి 'ఊ' అన్నాడన్నమాటే!

కే:—[తనలో] ఇచ్చినప్పుడు మాటగా! ఈమాత్రానికేనా ఈచిద్విలాసం! ఏదో అప్పటికి యోచిస్తాననకపోతే ఏమంటాడేం!...

రా:—ఏం!- ఏమిటాయోచన! యింకాసంశయమెందుకు?-రైట్ అన్నమాటే!

కే:—బాధయొక్క బలంచేతనే మనముకోరే కోరికలను సాధించగల మనిపిస్తుందండి మనస్సు.

రా :— సాధించి తీరినప్పుడే నన్ను రామశాస్త్రి అనిపిలు అంతే! అయితే— చూడు! వయసులో ముప్ఫయికంటే ఎక్కువఉన్నట్లు కనబడుతానటోయ్!

కే :— అంతే వయసు చెప్పారాండి?

రా :— ఊ!- నమ్మాడుకూడాను. అలానేనచ్చ చెపుతాడు యింటిలో, అంతకంటె ఎక్కువవయస్సు మన కెక్కడిదోయ్!

కే :— అవును లెండి. అబద్ధమాడిఅయినా ఒకయిల్లునిలుపడం ఉత్తమం అని శాస్త్రంలో కూడా ఉంది. నైట్రోజన్‌తో కలిస్తేనేగాని ప్రాణ వాయువు మన ఊపిరితిత్తులమీద పనిచేయలేనట్లు, కొంచెం అబద్ధాలతో కలిపి మాట్లాడితేనేగాని నిజంలోని నమ్మకం కనబడదుగా!

రా :— నువ్వు ఎలా అయినా తెలివైన వాడివోయ్! చెప్పడం మరచాను. ఓవేళ నాకు పెండ్లే స్థిరపడి మూడుముళ్ళూ పడితే నీ ఆఫీసుగది అవతలకు వేరుగా పెట్టుకోవాలి సుమా!

కే :— చిత్తం... వీధి గదులలో తాకట్టుసామాను లున్నాయికదండి!

రా :— వెధవ సామానులు తీయించి లోపలగదులలో వేయిస్తాను. నేను పిలచేవరకు నీవు ఎప్పుడుబడితే అప్పుడు లోనికి పరుగెత్తుకొని రాకూడదు. తెలుసా?

కే :— చిత్తం! ఆ ఏర్పాట్లన్నీ అలానే కానిద్దాం. ఏదో ఆకాస్తా అయి మీరు ఒక యింటివారు అయితే అంతేచాలు. ఈ కండ్లతో వధూవరులను చూచి...

రా :— ఏడిశావు! వధువును నువ్వు చూడడం ఎందుకోయ్! అవతలకు పో! పిల్లిని చంకపెట్టుకొన్నట్టే నీతో!-

కే :— చిత్తం. నేను వెళ్ళవచ్చాండి!

రా :— ఊ— దయచెయ్యి!

[కేశవరావు నిష్క్రమిస్తాడు.]

[తెరపడుతుంది.]

---

ఓమ్

# రేవతి

## ద్వితీయాంకము

### 3వ రంగము

[లీల సోఫాలో కూర్చుంటుంది చుట్టూ పుస్తకాల బీరువాలు ఉంటాయి. తెరలేస్తుంది]

[3వ అనుబంధం]

లీ :—

తే.గీ. తల్లి కులటంద్రు గనువారు తండ్రి నెఱుగ
సంఘమెడద్రోసె తలదాప తావులేదు
పతిత ననదను దీన నేపాప మెఱుగ
దిక్కఁ.రిన నన్నుగని బ్రోవు దివ్యతేజ.

[మోహన్ ప్రవేశం]

లీ :—[మోహనుని చూచి కండ్లుతుడుచుకుంటూ లేచి నిలుస్తుంది]

మో :—భయపడకండి. మీవారున్న స్థలానికి జాగ్రత్తగా పంపించి వేస్తాను. అసలు మీరు ఆహోటలు లోనికి ఏలా వచ్చేరు. మీది యీ ఊరేనా ?

లీ :—కాదండి. నేనొక అనాథను. కష్టస్థితిలో చిక్కి రైలులో వస్తూంటే ఒక ముసలాయన మంచి మాటలుచెప్పి నాతో మాట్లాడ కల్పించుకొని నా విషయం అడిగేరు. నేను మొదటిలో భయపడినప్పటికీ, ఆతని విశ్వాసపు బలుకులను నమ్మి నాస్థితి ఆతని కెరింగించాను. ఆతడు నాపట్ల చనువును చూపెడుతూ నా కాశ్రయమిచ్చి జనరల్ ఆసుపత్రిలో నర్సుగా చేరిపిస్తా నన్నారు.

మో :—ఆహోటల్లో మిమ్మల అల్లరిపరుచు వ్యక్తిఎవరు ?

లీ :—నాకు ఆశ్రయమిస్తానని వాగ్దానముచేసిన ఆ ముసలాయన మదరాసు వరకూ వెంటగొనివచ్చి, ఆ హోటల్లో నాకు బస ఏర్పాటు చేసారు. తరువాత ఎవరినో క్రొత్తవ్యక్తులను తీసుకొని వచ్చి ఘోరంజరిపించ చూచాడు. దానితో నేను కేకలుపెట్టేను. మీరువచ్చి రక్షించారు.

మో :—అసలుఇల్లువిడిచి ఎందుకువచ్చారు? అలారావడానికికారణం?

లీ :—క్షమించండి. ఆ విషయం చెప్పలేను. నా కథవింటే కళంకినని నన్ను ఇప్పుడే తరిమివేస్తారు.

మో :—కాదు. మీవారున్న స్థలానికి జాగ్రత్తగా పంపుతాను. దిగులుపడకండి. మీకుచెప్పటకు ఇష్టములేకుంటే నిర్బంధింపను.

లీ :—[మాట్లాడదు]

మో :—మీవారి యడ్రస్ !

లీ :—నాకుప్రస్తుతం ఎవ్వరూలేరు.

మో :—మీరుఇప్పుడు ఎక్కడికివెళ్ళాలి ?

లీ :—భగవంతుడు తీసుకుపోయే చోటికి.

మో :—మీరు కొంచెం మనోవేదనతో బాధపడుతున్నట్టున్నారు. విశ్రాంతితీసుకొండి.

లీ :—మీరు సహృదయులని మీమాటలవల్లనే తెలుస్తోంది. ఒకటి రెండుదినములు ఇక్కడనే నన్ను తలదాచుకోనిస్తే ఆతరువాత...

మో :—రెండు దినములుకాదు; కొన్ని సంవత్సరములు నాగృహములో ఉన్నా మీకేలోపము రాకుండ నిష్కల్మషహృదయంతో జరుపగలను. మీకష్టాలను నాకు ఎరుకపరుస్తే అవి కడదేర్పడానికి కూడ ప్రయత్నిస్తాను.

లీ :—నావిషయం ఆప్తులయిన మీకు చెప్పడం నావిధి అని తలుస్తాను. కాని...నా పాడుజీవితం గూర్చి మీ ముందు ఏకరుపెట్టడానికి నామనస్సు కొంచం సంకోచాన్ని సూచిస్తోంది.

మో :—సంకోచించకండి...

లీ :—అసలు మానాన్నగారు ఒక పెద్దమిల్లుకు అధికారిగా ఉండే వారు. నేనుచేతి పిల్లగా ఉన్నప్పుడే మాఅమ్మ ఒక ఇన్సూరెన్సు ఏజంటుతో లేచిపోయిందట. మాఅమ్మతీసుకొని వచ్చినఆస్తి క్రమేణా తరిగిపోవడంతోనే ఆబ్రాహ్మణుడు మాఅమ్మను చాలా బాధలు పెట్టేడు. 'సంకరం' అనేపేరుతో సంఘంమమ్మలను వెలివేయడంచేత యుక్తవయస్సు వచ్చినన్ను ఎవ్వరూ పెండ్లి చేసుకొన సాహసించలేదు. తనవల్ల నా జీవితమునకుకూడ కళంకం రాబోతున్నందుకు మాఅమ్మ కుమిలిపోయేది—

మో :—ఊఁ...తరువాత...

లీ :—ఒకదినమున మాఅమ్మ డబ్బు ఇవ్వలేదన్న కారణంచేత ఆ బ్రాహ్మణుడు బలంగాకొట్టి పారిపోయాడు. మాఅమ్మ ఆగాయం వల్లను, నా భావిజీవితంగూర్చి బెంగవల్లను మరణించింది.

మో :—హరహర !

లీ :—మాఅమ్మ జబ్బులో పని చేసిన డాక్టరు కుత్రిమబుద్ధితో నన్ను చేజిక్కించుకొన చూచాడు. ఆతన్నుంచి తప్పించుకొని, సంఘ దృష్టిలో నాకుతావులేక పోవడంచేత అల్లాడుతూ...

మో :—మిమ్ములను పెండ్లిచేసుకొన ఒక్కడును ప్రయిత్నించనే లేదా ?

లీ :—ఏలాసాహసిస్తారు! ఓవేళన్యాయబుద్ధితో సాహసించి ఎవరైనా వివాహముచేసుకో బూనినప్పటికి సంఘం 'వెలి' అను భూతాన్ని వెంటతరిమి అలాజరుగకుండా వెనుకకు లాగుతూంది.

మో :—డాక్టరునుంచి తప్పించుకొన్న తరువాత ఏమిజరిగింది ?

లీ :—'కులట' అని పేరువచ్చిన మాఅమ్మ కడుపునపుట్టడమే నానేర ముగాఎంచి సంఘంనాకు ప్రపంచంలో తావులేకుండచేసింది. నాశీలం కాపాడుకోవడానికి ఆత్మహత్యకంటే వేరుసాధనం అగు

పడక ఈ జీవితాన్ని సంఘానికి బలియిచ్చి ఆదర్శప్రాయ నగుటకు స్థిరపర్చుకొని రైలుఎక్కేను. అదిఎక్కడకు పోతుందో నాకే తెలియదు. ఆ తరువాత ఆముసలివాడు ఘోరం జరిపించచూడగా, నా కేకలతో మీరు నన్నాహోటలులో రక్షించారు.

మో :—ఇంతమాత్రమునకే ఆత్మహత్యా! అదిపాపహేతువుకదూ!

లీ :—హేయమైన నీచజీవితం అనుభవించడం కంటె దానివల్లవచ్చే పాపఫలితాన్ని సంతోషముతో స్వీకరించడం మంచిదని నా ఊహ.

మో :—మీ వారికి కబురుచేసి వారి అనుమతిమీద మంచివరుని చూచి పెండ్లిచేయడం మీకిష్టమేనా ?

లీ :—[మాట్లాడదు సిగ్గుతో]

మో :—చెప్పండి! సిగ్గుపడకండి.

లీ :—నాకు వివాహమందే యిచ్ఛనశించింది. అనుగ్రహముంచి మీకు ఏ ఆటంకమూ లేకపోతే మీ గృహమందే నాకు ఉండడానికి తావిచ్చి, నాముందు జీవితంగూర్చి నన్ను ఏ ఆసుపత్రిలోనో నర్సుగాచేర్చమని నాకోరిక; లేనిచో నాజీవితంగూర్చి కలుగ చేసుకొనవద్దని ప్రార్థన. కటువుగా మాట్లాడినానని తలంస్తే క్షమించండి.

మో :—పెండ్లికాని పురుషునియింట అవివాహితయగు స్త్రీయున్న పక్షమున సంఘం ఏలా శంకిస్తుందో తెలుసా? మీ జీవితానికిలేని కళంకముకాదా!

ఉ. లోకములోని సంఘమువిలోకనసేయదు భాగ్యశీలురన్
సాకులు పెట్టి యార్తలగన్, సైపదు బీదల, పెండ్లికాని నీ
వీకడనుండ గౌరవమదెట్టులచేకురు శీలభావమున్
పోకడపెట్టి తంచునిన్ను బువ్వదె లోకము నవ్వదే సతీ.

లీ :—సంఘం! సంఘంతో నాకిప్పుడు పనిలేదు. దానిచేత పూర్వమే నేను వెలివేయబడ్డాను ఎవరు ఏ విధముగా తలచినా ఇంతకంటె నాకు వేరుగత్యంతరం కనబడదు. మీకు నావల్లపమైనా నిందలు రాగలవను భయము కలుగుతే నా మార్గం నేను చూచుకుంటాను.

మో :—తప్పక వుండవచ్చును. మీకు ఎట్టి ఆటంకమూ లేదు. నా ఇంటిలో విచారాన్ని విడచి స్వేచ్ఛగా ఉండండి. తగిన మార్గం యోచించి మీ బాగుకోసం ప్రయత్నిస్తాను.

లీ :—కృతజ్ఞత.

మో :— మీ పేరును తెలుసుకోనవచ్చునా ?

లీ :—[సిగ్గుతో] లీల...

మో :—లీలగారూ! వ్యాకులతతో హృదయం గాయపర్చుకోకండి. అనాథలపట్ల సంఘం శిక్షించి బలి తీసుకుంటుంది. న్యాయవివక్షత వారిలో నశించిపోయింది. తల్లి చేసినతప్పులకు బిడ్డలు కూడ శిక్షకు అర్హులని వారివిశ్వాసం. దైవ మిచ్చినసద్బుద్ధిని ఉపయోగించు కొని న్యాయాన్ని గుర్తించలేకపోతూన్నారు. విధివశమున వ్యభిచరించిన స్త్రీయొక్క సంతతిని బలవంతపరచి కులటలగా మార్చి వ్యభిచారానికి చోటిస్తున్నదే సంఘం.

లీ :—మహాపంకంలోంచి బయటపడే సాధనం ఎరుగక, మృత్యువు నాశ్రయింపబోయే నన్ను ఆదరింపబూనిన దయార్ద్రహృదయులు మీరు. కాని అనాథస్త్రీకి యీ ప్రపంచములో తావులేదను కుంటాను. వారు శీలాన్ని కాపాడుకోదలస్తే ఆత్మహత్యే వారికి ముఖ్యసాధనం అని నాగట్టినమ్మకం.

మో :—శీలం కాపాడుకోదలచిన అనాథస్త్రీ అంతకంటే ఏంచేస్తుంది! వారి వివాహానికి చేయూతనివ్వని సంఘమునకు ఎన్నిప్రాణాలు ఎర అవుతుండడంలేదు! పిల్లలు చంద్రుణ్ణి అందుకో గలుగుతా

మనుకున్న క్లే పురుషులు అనాథస్త్రీల నందుకో గలుగు తామను విశ్వాసంతో వారిని తరిమి తమ చేతులలో యిరికించుకొనచూస్తారు. ఆ మెకిరస్కరిస్తే ఆమెపై పగసాధించి పట్టుదలగా పాడుచేసి విడుస్తారు. ఇదేనా న్యాయం! ఇదేనా సంఘం చూపవలసినదయ!

లీ :—న్యాయం! న్యాయంచచ్చి చాలా కాలమయింది. తల్లిచేసిన నేరంకు వారి బిడ్డలు కూడ ఆశిస్తా ఫలితాన్ని పొంది అనుభవించాలట.

మో :—లీలగారూ! భయపడకండి. న్యాయాన్ని యాచించి చేయూత నిచ్చేబుద్ధిమంతులు లేకపోలేదు. సనాతన ఛాందస ముతో కప్పబడ్డ ఈ సంఘం కండ్లు తెరవకపోదు.

లీ :—ఆదినం వస్తుందని నాకు నమ్మకం చాలదు.

మో :—ఇప్పట్లో కాకపోయినా ఆదినంవచ్చి తీరుతుంది.

[లోపలనుంచి] బాబూ! తమకొరకు ఎవరో దయచేశారు.

మో :—లీలగారూ! ఇప్పుడే వస్తాను. లచ్చునడిగి ఫలహారములు తీసుకోండి. [మోహన్ నిష్క్రమించును.]

లీ :—దేవా! కులట సంతతి అనే పేరుతో పుట్టించి మాకీ ప్రపంచ ములో తావులేకుండచేసేవా!

మ. అరయంతండ్రి గతించె పూర్ణయశుడై; అన్యాయమార్గమ్మునన్
పరకీయుండె జతగూడి తల్లియును ఈపైస్వర్గముగా జేరుటన్
అరుదై పోయెను నాకు సౌఖ్యములు; సంఘుగ్రకారవాతాహతిన్
జనుమయ్యెంగద జీవమేతుదకు దేవా! రక్షకుల్ లేరొకో?

[4 వ. అనుబంధం]

[తెరపడును.]

---

# 4 వ రంగము

[రేవతి రాట్నము త్రిప్పుతూ వుంటుంది తెరలేస్తుంది]

[5 వ అనుబంధము]

[వెంకటప్పయ్య ప్రవేశము]

రే :—నాన్నగారూ ! శాస్త్రిని కలుసుకున్నారండీ ! ఏమన్నాడు! వ్యతిరేకముగా లేడుగదా !

వె :—[కండువా ప్రక్క కుర్చీమీద పడవేసి నెమ్మదిగా కూర్చుంటాడు] ఏమంటాడు. అంతా విచిత్రదోరణిలో మాట్లాడేడు. ముందుచూస్తే నుయ్యి వెనుక చూస్తే గొయ్యిలాగుంది.

రే :—దావా చేస్తానన్నాడా ?

వె :—ఆ ! ఆతడు చెప్పిననిబంధనలకు వ్యతిరేకముగా ప్రవర్తిస్తే దావా చెయ్యడమేకాదు, ఫకీరులనుచేసి విడుస్తానన్నాడు.

రే :—[ఆతృతతో] ఏమిటా నిబంధనలు ?

వె :—ఏమిచెప్పమంటావు తల్లీ. నాతల తిరిగిపోతూంది.

రే :—చెప్పండి నాన్నగారూ ! ఏం-నేను వినకూడదా ? మీకష్టాలలోపాలు నేను పంచుకొనకూడదా ?

వె :—ఏలాను చెప్పాలి. మాసుఖదుఃఖాలు నీ మాటమీదనే ఆధారపడి ఉంటాయి. [నిశ్చలహృదయంతో] ఎన్ని కష్టాలు నన్ను చుట్టుముట్టినా నీయిష్టంలేంది నేను ఏపనీ చేయ నిచ్ఛగించను.

రే :—నాన్నగారూ ! అసలు విషయం చెప్పండి. నాకు చాలా ఆతృతగావుంది. నామాటమీదనే మీసుఖదుఃఖాలు ఆధారపడి వుంటె మీకువ్యతిరేకంగా నడచి మిమ్ముల కష్టాలపాలు చేస్తాననే సంశయిస్తున్నారా ? కన్న తలిదండ్రులనే వంచింప చూస్తాననే ఊహిస్తున్నారా ?

వె :—నాచిట్టితల్లీ ! నీవు మాకు వ్యతిరేకమౌతావనికాదు. మా చేతులారా నిన్ను దుఃఖాంబుధిలో త్రోయవలసి వస్తుందిగదా అని విచారం.

రే :—అసలు విషయాన్ని మరుగుపరుస్తున్నారు.

వె :—అమ్మా ! ఆకిరాతుడు హృదయంలేకుండా మాట్లాడేడు. మన తణకా ఆస్తికంటె మనం పుచ్చుకొన్న రొఖ్ఖం విలువ ఎక్కువగా కనబడుతుందనీ, ఆతడు దావా చేసిన మరుక్షణాన్నే మనము ఫకీరుల మవగలమనియూ చెప్పేడు.

రే :—కావచ్చును. అలాకాకుండా ఉండడానికి నిబంధనలు ?

వె :—తనఆస్తికి ఎవరూ వారసుల్లేరని తెలియజేస్తూ, ఆతనికి సంతతి లేకపోవడంచేత తనవంశం అతనితో అంతరించిపోతుందని భయపడుతూఉన్నట్లు తెలియపర్చాడు. ఆకారణంచేత తనకు-నిన్ను-ఇచ్చి వివాహం చేయమని గట్టిగా పట్టుబడుతూన్నాడు. లేకుంటే...

రే :—[ఆతృతతో] ఆతనితో నాకు వివాహమా ? నాన్నగారూ ! నన్ను ఆయనకే యిచ్చి వివాహము చేయడానికే నిశ్చయించారా ?

[భీతితో ఆతని భుజంమీాద తలను జేర్చును]

వె :—[ఆమెతలను నిమురుతూ] అమ్మా ! నీయిష్టంలేకుండా ఆలా చేస్తానా ? భయపడకుతల్లీ ! నీకు ఎంతమాత్రం ఆతనితో వివాహము జరుగదు. నేను ఫకీరునై ఎన్నికష్టములకు గురియైనా సహించగలను కాని నీజీవితం కూకటివ్రేళ్ళతో పెకలించ డానికి మాత్రం సమ్మతించను. భయపడకు తల్లీ...

రే :—నాన్నగారూ ! ఆస్తి అంతా ఆదుర్మార్గుడు స్వాధీనపరుచుకొని మనలను యీాయింటిలోనుంచి పొమ్మంటే జబ్బుస్థితిలో

వున్న అమ్మమరింత బెంగపెట్టుకోదూ! ఈదిగులుతో జబ్బు ఎక్కువై ...

వె :—[నిట్టూర్పుతో] అమ్మా! అన్నిటికీ ఆదైవమే వున్నాడు. బీదలజీవితములు ధనవంతుల సుఖాలకు నైవేద్యం పెట్టాలి. లేకుంటే వారికి తృప్తికలుగదు.

శే :—[శాస్త్రినుద్దేశించి] ఎంతటి కుటిలవర్తనుడు ఆశాస్త్రి! అవ్యాజంగా అడగకుండ యిస్తారు ధర్మాత్ములవలె ధనము, సహాయము. వడ్డీతో బీదల శరీరం నుంచి దాని విలువను గ్రహింప చూస్తారు. ధనవంతుల దృష్టిలో స్త్రీ బజారువస్తువులా కనబడుతూంది కొనుక్కొని యిష్టమువచ్చేటట్లు వాడుకొనేందుకు. ఏనాడూ ఎరుగని, చూడని, ఊహించని వ్యక్తికి యీ నాశరీరాన్ని, యౌవ్వనాన్ని, యీ శోభని వానికి లోబర్చి ప్రేమనేదిలేకుండా నాజీవితమంతా ఆతని ప్రక్కనే చెప్పు చేతల్లో వుంచి బానిసనై పోవాలట...

వె :—తల్లీ! ఏదో ఆతడన్నామాటలు చెప్పాను అంతే!...శిక్షితలేని వివాహాన్ని నేను మాత్రం స్వార్థంకోసం చేస్తానా? నిన్ను సాగనంపి శాంతిజీవితం గడపగలనాతల్లీ!

శే :—నాన్నగారూ! నాకు ఆతనితో వివాహం జరిగించకపోతే మీఆస్తికాస్తా కాచెయ్యడమే కాకుండ మిమ్ములను కష్టాల లోనికి యీడుస్తాడేమో! శాస్త్రి సంగతి మనకు మొదటి నుండి తెలిసిన విషయమేగా!

వె :—ఏం చేస్తాము తల్లీ! ఆ శ్రీహరి మీదనే భారమువైచి కష్టాలను ఎదుర్కొంటాను.

శే :—తండ్రీ! నావల్ల మీకా కష్టాలు రాబోతూన్నాయంటే నే సహించలేను. మనం ఫకీర్లము కాబోతూ వున్నామని మంచం మీద వున్న అమ్మకు తెలుస్తే యిప్పుడే ప్రాణాలు వదులుతుంది.

వె:—అమ్మా! యిప్పుడామెకు చెప్పడం ఎందుకు జరుగుతుంది!

రే:—రేపుమాత్రం తెలియక పోతుందా? ఊరంతా చెప్పుకొని విచారపడు చున్నప్పుడైన అమ్మ చెవినిపడక పోతుందా?

వె:—[నిట్టూర్పుతో] నేను ఏమి చేయగలను తల్లీ! జరుగనున్నది జరుగక మానదుకదా? జరుగబోయెడుదానికి చింతిస్తేమాత్రం ఫలితం ఏముంది?

రే:—[ముఖంలో ధైర్యాన్ని కనబరుస్తూ నిశ్చల హృదయంతో] నాన్నగారు! చింతించకండి. ఆయన్నే వివాహము చేసుకుంటాను. నా సౌఖ్యముకోసం మీజీవితాన్ని ఆహుతిచేయలేను. మీరు సంశయించకండి.

వె:—అమ్మా! వద్దు. నీసౌఖ్యంమాకోసం బలిచేయవద్దు. ఆ కష్టాల్ని నేనే ఎదుర్కొంటాను. భగవంతుడే ఉంటే.—

రే:—పాడుభగవంతుడు! భగవంతుడేవుంటే కష్టాలతోనిండి మీకు మరిన్ని కష్టాలను కట్టిపెట్టడు. నిజంగా భగవంతుడే ఉంటే అతనికి న్యాయాన్యాయములు లేవన్నమాట. వెళ్ళండి. వివాహ ముహూర్తం నిశ్చయించండి. యీ త్యాగంతో తలిదండ్రులను దరిచేర్చిన ధానినవుతాను. నాన్నగారూ! విచారించకండి. సంశయం వదలి అతనికి యీ వర్తమానం తెలియజేయండి. ఊ- త్వరపడండి.

వె:—అమ్మా! యోచించే మాట్లాడుతున్నావా? ఆ తరువాత ఏ అవమానమమైనా జరిగించుకుంటే భరించి జీవించలేము తల్లీ!

రే:—నాన్నగారూ! అట్టిది నావిషయంలో జరుగదు. అమ్మ జబ్బుకు యిప్పటికే చాలడబ్బు అవసరంగా కూడావుంది.

మనచేతిలో ఒక కానీకూడ లేని స్థితిలో ఉన్నాం. వెళ్ళండి. నిండు హృదయంతో ఆ వివాహానికి వప్పుకుంటూవున్నాను.

వె:—తల్లీ! మాకోసం నీజీవితం బలియివ్వ దలిచేవా? యిది తలుచుకొని...

రే:—ఉష్! నాకేవిచారంలేదు. ఉత్సాహంగా ఉండండి. అమ్మకు ఆరోగ్యం చేకురుతుంటే అంతేచాలు. ఏ అమానుషం జరిగించుకోనని ప్రమాణంచేసి మీకు తెలియబరుస్తున్నాను.

[లోపలనుంచి] అమ్మాయి!...

రే:—అదుగో! అమ్మ పిలుస్తోంది. అమ్మకు మందివ్వండి. ఇప్పుడే పకులు పెట్టిలో పెట్టివస్తాను.

[వెంకటప్పయ్య నిష్క్రమించును]

రే:—

సీ. ఋణదాత లోకవంక రేయిం బవళ్ళు త
న్నలజడ పెట్టగా నటమటించు
దీర్ఘ రోగమ్ముచే దీనయౌ భార్యకు
వైద్యమీయగలేక వగచుచుండు
నీకూతు నాకిచ్చి నీయాస్తి నిల్పుకొ
మ్మని బల్కు శాస్త్రి కేమనగలేదు
పదశుల్కమిచ్చి వద్వరు నాకు గూర్పగా
ధనమింతయును లేక తహ తహ పడు

గీ. తుదకు రోజును గడపుటే దుర్భరమ్ము
గాగ తపియించు నాతండ్రి కష్టములను
పోనడప వృద్ధుతో పెండ్లిపూని, దాన
తృప్తినందెద జనకుని ఋణము దీర్చి.

8

అయ్యో! మంచి ఏమను సమస్య వచ్చింది. ఇటు కనిపించిన తలిదండ్రులు. అటు ప్రేమించి పరిణయమాడ జూచుచున్న నా మోహనుడు. [నిట్టూర్పుతో] నాకు వివాహమయిందని తెలుస్తే ఆతడు ఎంతగా పరితపించి, నన్ను ఎంతగా దూషిస్తాడో! నా హృదయం బ్రద్దలవుతోంది. [ఒకనిమిషం ఆగి] నాకృతఘ్నతవిని ఆతడు ఎంతగాహడలి దుఃఖిస్తాడో నాకు తెలుసు. [మోహనుని ఉద్దేశించి] మోహన్! నేనుమరణించినానే అనుకో, అంతకంటె ఎక్కువగా నశించేనే అనుకో, నీపటమెప్పుడును ఈమలిన హృదయమున శాశ్వతంగా నిలిపి పూజించుకుంటాను. [నిమిషంఆగి] నాకు తెలుసు. నన్ను నీచురాలుగా తలచితీరుతాడు. డబ్బుకోసం ఆసించి, శాస్త్రిని వివాహమాడేనని తలచి కలతపడకమానడు. నిజమే...ఆతనిది నిర్మాలిన్యమైనప్రేమ. నాదిక్షుద్రప్రేమ...నీచప్రేమ...కపటప్రేమ...ఆయనప్రేమ ఉదారమైంది...ఉన్నతిమైంది...ఉత్కృష్టమైంది. [కంట వెంటనీరు జారుస్తు] హా విధి! బీదలపాలిటి నీవెంతకఠినహృదయుడవు! [ఒకనిమిషంఆగి] మోహనునికి యిచ్చట పరిస్థితులతో ఉత్తరం వ్రాసి క్షమాపణకోరితే!—ఊహూ! యిక అతనితో నాకేం పని! అలావ్రాయను. శాస్త్రిగారితోనే నాకు వివాహంకావాలి. నాతలిదండ్రుల సుఖాల్ని చూస్తూ కాలాన్ని దొర్లిస్తాను.

[అంటూ పమిటిచెంగుతో కండ్లనుతుడుచుకుంటూ నిష్క్రమించును]

[తెరపడుతుంది]



# 5 వ రంగము

[మోహన్ కూర్చుని ఉత్తరాన్ని చూస్తూంటాడు: తెరలేస్తుంది]

మో:—

సీ. బాపురే! రేవతి ప్రాణాధిక యటంచు
తలచిననాయాస దగ్ధమయ్యె
అతిలోకరమణీయ యభినవమాధురీ
పూరమేమాయని పోల్చుకొంటి
నాచిత్తసరసిలో నటియించురాయంచ
శ్రీమంతువలలోన చిక్కువడియె
అందితిసత్ఫలంబని హర్షముననుండ
ముదిగ్రద్దగొనిపోయె మోసగించి
గీ. అకట ప్రేమైకధన మిట్టులగునటంచు
స్వప్నమందైన నెంచనీ! సతులప్రేమ
మించుకంటెను చంచలమంచుదెలసె
ధనముకాశించి యర్పింత్రు ప్రాణధనము.

రేవతిహృదయం ఇంత చంచలమని తెలుసుకొనలేకపోయాను. ధనంకోసం తన పూర్వప్రేమనుకూడ త్యజించగలిగిందామె. ఇక నాకీప్రపంచంలో ప్రేమశూన్యం. ప్రజాసేవచేసి తరించడంలో నాజీవితాన్ని వినియోగపర్చుకుంటాను. ఆ సేవలోనే నాకు శాంతి, చేకూర్తుంది. అప్పుడుగాని రేవతితో కలిగినపూర్వ పరిచయాల్ని మరువలేను. [లోనికిచూచి] పాపం! యీలీల అమాయకంగా నాపట్లప్రేమను చూపుతోంది. నిర్దాక్షిణ్య బుద్ధితో సంఘం కులటసంతతిని వేరుపరచి వారినితరిమి కులటగా మారుస్తోంది. యీ జాతిని లేవనెత్తడానికి నాసర్వశక్తులూ వినియోగించి న్యాయంకోసం ఆ అధర్మసిద్ధాంతాలను ఎదుర్కొం

టాను. ప్రేమకోసం కాకపోయినా పట్టుదలకోసమయినా యిట్టి పడతినే వివాహమాడి సంఘాన్ని ఎదుర్కోవడం నాధర్మమని తలుస్తాను. ఆజాతిసంతతిలో కళంకంలేదని వాదిస్తాను. వాదించడమేకాదు ఋజువుపరచి సంఘవేత్తలకండ్లు తెరిపిస్తాను.

[లీల కాఫీట్రేతో ప్రవేశము]

మో :—ఓ ! మీరా ! కాఫీతీసుకొని వస్తూవున్నారా ! ఏం !... గోపీ ఎక్కడ !

లీ :—ఏం ! నేనుతీసుకొని రాకూడదా ?

మో :—ఆ శ్రమ మీకు కలుగజేయుడం నాకిష్టంలేదు. సర్వెంటు ఉండగా...

లీ:—[సిగ్గుతో] నేనేమీకు కాఫీని అందజేయ కుతూహలంతో...

మో :—మీరు...నాకోసం...

లీ :—నాకుఒక్క విషయంలో మాత్రంకష్టాన్ని కలిగిస్తూన్నారు.

మో :—నాగృహమందేమీకు కష్టంకలుగుతూందా ?

లీ :—గృహమందుకాదు—మీవల్లనే.

మో :—[ఆశ్చర్యంతో] మీకు...నావల్ల...

లీ :—అదుగో !

మో :—ఆ ! !

లీ :—'మీరు...మీరు...' అని సంబోధించినాకు తీరనికష్టాన్ని కలుగజేస్తూన్నారు.

మో :—(నవ్వుతూ) ఓ ! అదా ! మరి ఏలాపిలవడం చెప్పండి.

లీ :—(ప్రేమనుసూచించే సిగ్గుతో) 'లీలా' అని పిలువండిచాలు.

మో :—సరే ! మీయిష్టం అలానేపిలుస్తాను.

లీ :—మీరు అలావిచారంగా కూర్చోవడానికి కారణం అడుగవచ్చునా ?

మో :—మాఊరివిషయంలెండి.

లీ :—అదిగో ! మళ్ళీ మీారని...

మో :—[పొరపాటు గ్రహించుకొని] పొరపాటే లీలా!

లీ :—ఊరివిషయం అంటే ! అంత విచారించవలసిన కారణం ఏముంది ఆ వుత్తరంలో !

మో :—మాఊళ్ళో రేవతి అనే అమ్మాయివుంది. మేము చిన్నతనంనుంచీ మొన్నటివరకు ఒకరినొకరు విడువకుండ ఆడుకొనే వారం. ఇప్పుడామెకు వివాహమయిందట.

లీ :—దానికి విచారమెందుకు?

మో :—పాపం...ఆమె వివాహం ఒక ముసలివానితో జరిగింది.

లీ :—అందుకు ఆమె వప్పుకుందా ?

మో :—అతని డబ్బున కాశించి వివాహం చేసుకుందని నామిత్రుడొకడు అక్కడనుంచి వ్రాసేడు. ఆమె అంగీకారాన్ని తీసుకొనే ఆమె తలిదండ్రులు ఆమెకు వివాహం చేశారట.

లీ :—నేను నమ్మను. ఏ స్త్రీ యిష్టతతో ధనమున కాసించి ముసలి భర్తను కట్టుకొన నిచ్ఛగిస్తుంది !

మో :—అవును. మొదటలో మానాన్నగారి దగ్గరనుండి ఉత్తరం వచ్చినప్పుడు ఆలానే అనుకున్నాను. గాని నామిత్రులు వివరించి వ్రాయడంచేత ఆవిషయాన్ని యిప్పుడు నమ్ముతూవున్నాను.

లీ :—కాఫీ చల్లారి పోతోంది. త్రాగండి.

[యిద్దరూ కాఫీని తాగుతుంటారు]

మో :—లీలా...కాఫీలో చక్కెరలేదే !

లీ :—నాకాఫీలో సరిపోయిందే !

మో :—అసలు వేసినట్లే కనబడదు దీనిలో !

లీ :—ఏదీ చూడ నివ్వండీ ! [అని అతని చేతిలో కాఫీని తీసుకొని నవ్వుతూ త్రాగుతుంది.]

మో :—[ఆశ్చర్యంతో] ఆ !-ఆ !!-

లీ :—పంచదార ఎక్కువగానే ఉందే !

మో :—ఇదంతా గారడీ కాదుగదా ! ఏదీ ఇటు తే !

[అంటూ ఆమె చేతిలోని కాఫిని త్రాగుతాడు]

లీ :—ఆ ! ఆ !! అదేమిటండీ !!

మో :—[నోరు చప్పరిస్తూ] ఎంత చక్కగాఉంది కాఫి !

లీ :—ఇంతలోనే మారిందా ?

మో :—ఆ ! నీ పెదవుల మధురం దీనిలోకలసి...

లీ :—అబ్బా ! ఊరుకోండి.

మో :—కోపం వచ్చిందా లీలా ! నవ్వవేం !

లీ :—[చిరునవ్వునవ్వి ఊరుకుంటుంది]

మో :—లీలా చెప్పడం మరచేను. నీముఖము పోలిక పుస్తకంలో గీస్తూవుంటే మా లెక్చరర్ చూసేడు. ఆదెబ్బతో కంగారుపడి నాబనీను అంచునులాగి నాహృదయానికి దగ్గరగానిన్ను దాచేసుకున్నాను.

లీ :—[సిగ్గుతో తల వాల్చుకుంటుంది]

మో :—నీకు కోపంగా ఉన్నాయా నామాటలు. పోనీ...

లీ :—నాకు కోపమా ? మీమాటలు వింటూవుంటే ప్రపంచాన్నే మరుస్తాను.

మో :—మరి ఎందుకు ఆలా కండ్లువాల్చి జవాబు చెప్పక హృదయాల్లో ఏదో రహస్యమైన బాధవున్నట్లు తోపిస్తావు.

లీ :—మీ గౌరవజీవనానికి భంగపాటు కలుగచేస్తున్నానేమో అన్న విచారందక్క...

మో :—ఛీఛీ ! అలా మాట్లాడకూడదని చాలాసార్లు చెప్పడమైంది. మళ్ళీ...

లీ :—మీరు కాలేజీకి కూడ సరిగా వెళుతున్నట్లు కనబడదు.

మో :—ఏం చెయ్యను లీలా ! యిచ్చటనుండి కదలి పోవడంఅంటే అమరలోకంలోంచి దండకారణ్యంలో ప్రవేసించడం లాగుంటుంది.

లీ :—మోహన్ ! మిమ్ములను మీరు మరచి చరిస్తూన్నారు. మీకీర్తి గౌరవాలకు నావల్ల హాని కలుగుతుందేమో అని దిగులుగా ఉంది. కళంకినను పేరుతోనున్న నాకు ఆశ్రయమిచ్చి, నా ఊహాలకు రంగులువేసి, ఆకారమిచ్చి...

మో :—లీలా ! నీవులేని ప్రపంచం నాకు శూన్యం. సంఘం గ్రుడ్డిది. దాని మాటలతో నాకు పనిలేదు. తల్లిచేసిన నేరమునకు నీవా శిక్షను అనుభవించేది ? అది న్యాయమని నేను వప్పుకోను. నీ తల్లి నేరమునకు ఆశిక్షణ నీతల్లే అనుభవించాలి. ఆకళంకం నిన్ను అంటడానికి తావులేదు.

లీ :—వద్దు సంఘనియమాలు మీకు తెలియవు.

మో :—లీలా ! నీ ప్రతిప్రవర్తనా నన్ను ఆకర్షించింది. మొదటలో నాకాఊహ లేకపోయినా క్రమేణా నీ మాటలు, నమ్రత, దయ నన్ను సూదంటురాయిలా ఆకర్షించాయి.

లీ :—అధికంగా అభిమానంచూపి, నన్ను — నా శరీరాన్ని మలిన పర్చకండి. నా భారతీయ సతీత్వం నిలువబెట్టుకొని దేశసేవ చేసి త్యాగబుద్ధితో తరింప చూస్తూన్నాను.

మో :—నన్ను అనుమానిస్తూన్నావా ? త్యాగబుద్ధితో నిన్ను— వివాహం చేసుకొని ప్రపంచానికి నీతిపాఠాన్ని గరపి ఆదర్శ ప్రాయుడ నవదలచిన నాకోర్కెను త్రోసిబుచ్చకు.

[6 వ అనుబంధం]

లీ :—

ఉ. బంగరువంటి మేనుగని ; పావనశీలయటంచు నెంచి ; భూ
గాంగనగాగ కూర్చుకొని కాంక్షలు దీరెడునంతదాక న
న్నంగజు కేళి నేలెద ; వనంతరమేగతి బోవుదాన? నీ
చాంగ సుఖమ్ముకై యిటులు సల్పుట న్యాయమె నీకు మోహనా !

మో :—లీలా ! ఇప్పటికినీ నా హృదయాన్ని గుర్తించనేలేదా ? కుచ్ఛితపుబుద్ధితో నిన్ను పాడుచేసి విడుస్తానా ? పిచ్చిదాన ! అగ్నిసాక్షిగా హిందూమత ప్రకారం నిన్ను వివాహమాడి సంఘానికి మార్గదర్శకుడనవుతాను.

లీ :—నాకిష్టంలేదు. వివాహమందే ఇచ్ఛ నశించింది నాకు. ఏ హాస్పటలులోనో నర్సునై నా జీవితాన్ని ప్రజాసేవకోసం విని యోగించి మోక్షసాధనానికి మార్గం చూచుకుంటాను. కళంకినను పేరుతో జీవించి యుండడం...

మో :—ఆ ఎర్రని చిన్న పెదవులు, పచ్చనిశరీరం, నీ కోమల హృద యం వూరకే అడవిని పూసిన పుష్పమైపోవలసిందేనా ? నీ కోరిక లకు,ఆశలకు ఆకారము నివ్వనిష్టములేదా ? పిచ్చిపిల్లా ! నన్ను విడిచి వెళ్ళడానికే నిశ్చయించుకున్నావా ? పద...ఆ ఆసుపత్రి లోనే నేనూ ఓనౌఖరునై నీప్రక్కనే తిరుగుతూ...

లీ :—[నవ్వుతూ] ఏమిటామాటలు ! మీారు కాబోయే పెద్దపీడర్లు.

మో :—నీవు మాత్రం ! కాబోయే...ఊ...ఊ...

లీ :—రాబోవు విషయములను గుర్తించకుండా మాట్లాడుతున్నారు.

శా. తల్లిందండ్రియు నీకుఁ గూర్చుసఖులున్ ధర్మాత్ములౌ సద్గురుల్
చెల్లంబోదిఁదియన్న నాడయిన నన్ చేపట్టి జీవితం
బెల్లన్ రీతుల సౌఖ్యదాయి యగు న ట్లింతేనియున్ ధైర్యముం
గొల్లంబెట్టగ నిల్చువాడవౌనా ? నా కోసమ్మునై మోహనా !

మో :—లీలా ! నీవు ఆత్మగౌరవముకలిగిన స్త్రీవని నేనెరుగుదును. రాబోవు కష్టములను ఎదుర్కొని నేటి ప్రపంచానికి న్యాయం చూపడానికే నిన్ను వివాహముచేసుకొన స్థిరపర్చుకున్నాను. దేవుడు కూడ ఈ పట్టుదలకు అడ్డునిలచి ఆటంకపర్చలేడు. నా మాటలు విశ్వసింపలేవా ?

లీ :—ఈ సంఘం ఆచారం పేరిట నిర్మించుకున్న ఇనుపగోడలను మీరు దాటగలరా? వారి బహిష్కార కవాటాన్ని బ్రద్దలు గొట్టగలరా ? వద్దు. మోహన్ ! మిమ్ములను కష్టాలకు గురి చేయలేను.

మో :—చచ్చు సంఘం ! హృదయంగల విద్యావంతుడు లెక్కించడీ సంఘాన్ని. సంఘంచేసేది అఘాయిత్యమని తెలుసుకున్నప్పుడు ఎదిరించడానికి ఏమానుష హృదయం వెనుదీస్తుంది ! ఇదిగో ! త్రికరణశుద్ధిగా చెప్పతూఉన్నాను విను లీలా ! లోకభానుని ప్రచండ కిరణాలకు గురిగాకుండ నీకు నా జీవితఛత్రంలో ఛాయ నియ్యాలనే నిర్ణయం బలంగా నాలో అలుముకుంది. బూజుపట్టి, పుచ్చిరాలిపోతూవున్న యీ పాతనియమాలతో నాకు లెక్కలేదు. నీశీలంతో నాకుపనిగాని నీ తల్లిగుణగణాలతో నాకు సంబంధంలేదు. శిక్షవిధించడంకూడ చేతరాని సంఘం సంగతి ఇహ నాముందు ఎత్తకు. చిన్నతనంలోనే భర్త గతించిన బాలికకు ఆదెబ్బతో వివాహ అర్హతతగ్గి పూరుకున్నట్లేనట ! ఆమె జీవితమంతా బుర్ర గొరిగించుకొని వేడిరొట్టెలు తింటూ అగుపడని రాముణ్ణి భజించుకుంటూ కూర్చోవడమేనట ! ఎవరో తల్లిచేసిన దోషాలు ప్రపంచమే ఎరుగని ఆమె సంతతి అనుభవించడమా ? ఇతరులకు అన్యాయంచేస్తూ స్వభావాల్ని నీచపర్చుకుంటూ వున్నామే అన్న మెదడు, అభిప్రాయం,

10

నీతి, అంతరాత్మలేకుండ గంతులేసే స్వార్థపరులమాటలు ఇప్పటి ప్రపంచంలో ఏలా చెల్లుతాయి! న్యాయబుద్ధితో యోచించే మెదడు ప్రతివారికి భగవంతుడు ప్రసాదించేడుగా!

లీ :—మీకు నాయందుగల ఆప్రేమే అలా అనిపిస్తోంది. కాని మీవారు వప్పుకుంటారా?

మో :—ఒకరియిష్టాలతో నిమిత్తమేమిటి! కోర్కె—బీజం నాలో ఏగాలి రడీవల్లనో గాని చెట్టై, పెరిగి, ముసలివృక్షమై ఎక్కువలోతుగా నాలో ఊడలు దింపుకుంది. దానిని పెకలింప ఎవ్వరికి సాధ్యమౌతుంది లీలా?

లీ :—మోహన్! నీమాటలువింటూంటే మైకము క్రమ్మిన పసిదాన నవుతూ ఉన్నాను. సారంలేని నాజీవితానికి యిన్నిరంగులువేసి మహానందంలోనికి దారిచూపి నన్ను మరిపిస్తూన్నావు. నీ ప్రక్క నున్న యీ గంటలు స్వర్గమయంగా ఉంటాయి. మీరు వెను దిరిగిన మరుక్షణమునుంచి ఏవో ఊహాలు నన్ను బాధిస్తునే వుంటాయి. మీకు నేను ఏదో అపచారము చేస్తున్నట్లుగనే నా హృదయం ఘోషిస్తుంటుంది.

మో :—లీలా! నీకు నాయందుప్రేమ లేదా? ఇతరవూహాలకు నీలో చోటు ఎందుకిస్తావ్!

లీ :—నీవు కావలెననే గాఢకాంక్ష నా ఆత్మకి శరీరానికి అతీతమై నన్ను పీడిస్తోంది. కాని మోహన్...

మో :—చాలు! ఇక తదితరములు అనవసరం. నాఉత్సాహానికి దెబ్బతినిపించే మాటలు ఇహ మాట్లాడకు.

లీ :—ఇలాగనే మగస్నేహితులులా కలసివుండడం మంచిదని నా ఊహ.

మో :—ఇతరులు శంకించే స్నేహం ఉండకూడదు. త్వరలోనే ముహూర్తం స్థిరపరచుకొని యిక్కడనే సంఘం ఎదుట తథాస్తు అనిపించుకుందాం.

లీ :—అదిఏలా ?

మో :—రిజిష్టరీ మేరేజ్. ఇదిఒక మోడరన్ విధానం. దీనికి బంధువులతో నిమిత్తంలేదు. నా స్నేహితులను మాత్రం ఆహ్వానించి త్యాగబుద్ధితో నిన్ను వివాహం చేసుకొని నిన్నుబోలు స్త్రీలకు ఇహముందైనా అన్యాయం జరగకుండు విధానానికి మార్గదర్శకుడ నవుతాను.

లీ :— జీవితం అర్ధవిహీనంగా.. ఆదర్శాలు, ఆశలు అబద్ధాలుగా తోచిన నాలో మళ్ళీ వాటిని చిగురింప చేస్తున్నారు.

మో :—కాదు...చిగురింప చెయ్యడమేకాదు. నీ యౌవ్వనమునకు ఫలితాన్ని ప్రసాదించి నాలో ఐక్యముచేసుకుంటాను.

లీ :—[తేరిబారచూచి] మోహన్ !...

మో :—లీలా !—

[ఆమె శిరమును తన వక్షానికి దగ్గరగా అదుముకొంటూ తల నిమురుతాడు]

7 వ అనుబంధం - డైలాగ్

[తెరపడుతుంది]

---

ఓమ్

# రేవతి

## తృతీయాంకము

### 6వ రంగము

[రామశాస్త్రి గృహం. రేవతి లేపల్లిపూ ఒంటరిగా కూర్చుని ఉంటుంది. తెరలేస్తుంది]

రే :—

సీ. తలతెల్లనైన దంతముల్ దలగిన
మారు పెండ్లికి తాత మలయుచుండు
పదిఏండ్ల బిడ్డకు భర్తచచ్చినయంత
సంఘంబు విధవగా జలుపచూచు
బిడ్డలెందరున్న బెంపిచ్చి మనతాత
మనుమాడదలచును మనుమరాలి
ఈడుజోడునుజూడ కీరీతి జేపట్టు
పిన్నదా వృద్ధుతో వేగగలదే!

తే. గీ. సంఘమును చట్టమును రెండు జంటగానె
బాధపెట్టుట తెలియదో ప్రభునకేమొ
అతనిసృష్టిని స్త్రీ పురుషు లందరొకటె
ఒకరినోంచును సంఘ మింకొకరిబెంచు.

హృదయంలేని ప్రేమతో తృప్తిపడగలనా? ఈదుగానిభర్తతో నాజీవితం అంతా గడుపవలసిందేనా? ఈ నాజన్మలో ఈ శిక్షకు పరివక్వమేలేదా! ఓదేవదేవా! నీబిడ్డలలో ఒకదాననగు నామీాదనే నీకీ అన్యాయమేల? జన్మాంతరం ఈశిక్ష అనుభవించవలసినంత

నేరం నేనేంచేసేను ? నీబిడ్డలమీాదనేసీకు బేదాభిప్రాయములా ? అందరిని సమానదృష్టితో చూస్తావని చెపుతారే ! యిప్పుడు నాపై యీాకఠినదృష్టివల ! [కండ్లనీరు తుడుచుకుంటూ] నాజీవిత పుష్పం వికసించకపూర్వమే రాలిపోయినట్లయింది. ఏధైర్యముతో నాదినములు గడపాలి ? [ఒకనిమిషమాగి] ఊ ! ఒకటేతృప్తి. నాతల్లిదండ్రులకు స్వేచ్ఛను కలుగజేసి వారినోదరికి చేర్చినదాననై నాను కాని-పాపం ! ఆమోహానుడు యీావిషయాన్ని విని ఎంత విచారపడి వుంటాడో ! కాదు——నేను మోసకారినను తలపుతో కోపించి నిస్పృహతో వూరుకొనివుంటాడు. పోనీ—ఆవిధముగానైనా ఆయన శాంతిగా నన్ను మరిచిఉండడానికే భగవంతుని ప్రార్థిస్తాను. నేనే అతనిపట్ల అపచారంచేసినట్లుగా అగుపడడమే అతనిని దరిజేర్చినదాన నవుతాను. హా !...విధి !...మధుర బంధనాలతోకట్టి ఏకంచేసి కఠినంగానవ్వుతూ పాపంఅని తలచకుండా ఒక్కనిమిషంలో చీల్చి విడదీసి చెరోమూాల యీా అనంత వైశాల్యప్రపంచంలో ఒకరికొకరు అందకుండా...ఎంతపిలచినా... ఎంతవిలపించినా ..లాభంలేకుండా వేరుచేస్తోంది విధి. ధనవంతురాలనయ్యానని సంతసించాలట ! ఏస్త్రీ అంతమాత్రంలో తృప్తిపడి పూరటచెందగలదు ! కాదు . నామోహానుని క్షమించ మని కోర్తాను . నావల్లపొరపాటేనని కాళ్ళమీాదపడతాను [కండ్లు తడి పెట్టుకుంటూంది]

[రామశాస్త్రి ప్రవేశం]

రా :——అనే ! చిట్టీ ! ఏమిటా అల్లుతూాండేది. [ప్రక్కన కూర్చునబోతాడు, రేవతి లేచి ప్రక్క కుర్చీలో కూర్చుంటుంది]

రే :——[మాట్లాడదు]

రా :——మాట్లాడవేం ! రా ! యిలా కూర్చో ! రేవతి ! ఎంత అందంగా ఉందే నీ కావేరు!

రే :—[ఊరుకుంటుంది]

రా:—యిదిగో చూడు! చెప్పడంమరచాను. మన అరటితోటలో ఒకటోరకం చెక్కెరకేళీగెల మీనాన్నగారి యింటికి పంపించాను. మన యింట్లోకి ఏమైనాఉంచాలంటావా?

రే :—[విసురుగా] అక్కర్లేదు.

రా :—అదిగో నాకు తెలుసు! సంసారం పొదుపుచేస్తున్నావ్. నీ సంసారం నీకు తెలియదేం! అలానేఉండాలి కాని...యిదంతా నీ తరువాతే! మన ఇంట్లోకూడ కొన్ని గెలలు నిలువవేయిస్తాను. ఏమంటావ్ !

రే :—[విసుగుతో] ఏదో ఒకటి చెయ్యండి.

రా :—రేవతీ! ఒక్క నిమిషమైనా నా ప్రక్క కూర్చోడానికి అసహ్యయించుకుంటావేమే! అప్పటికీ శుభ్రంగానే వుంటున్నానుగా!

రే :—యిహ అస్తమానం నా చుట్టూ తిరుగుతే ఎలా! యిహ వ్యాపారం చూచుకో నక్కర్లేదా!

రా :—గుమాస్తాగాళ్ళు ఉన్నారుగా! మనమే చూచుకోవలసిన పనిలేదు కాబట్టే కాలక్షేపానికి నీ దగ్గరకు...

రే :—నాకసహ్యం-వదలకుండా తిరుగుతే!

రా :—చూస్తుంటే. తీవ్రవాంఛతో ఒళ్ళోంతా వుడికిపోవడం తప్ప ఇతర పనులమీదకి మనస్సు పోందే!

రే :—నన్ను విసుగించక అవతలకు నడువండి.

రా :— ఇదిగో- రేవతీ! ఆవేళ పాడేవే ఆ పాట ఒక్కసారి వినిపించు. మళ్ళీ వినాలని కోరుతోంది నా మనస్సు.

రే :—ఉహూ! ఇప్పుడుకాదు.

రా :—యిదిగో ! నేను చెపుతే నీవు మరి వినాలి అంతే. పాడవ్ ! ఊ . కానియ్ ! వీణతేనా !

రే :—అక్కర్లేదు. నేను తెచ్చుకొంటాను. అలా దూరంగా కూర్చోండి వినిపిస్తాను.

రా :—రైట్ .. మైడియర్ —గావో !

రే :—[వీణతీసి మీటుతూ]

8 వ అనుబంధం.

రా :—ఏం సుఖం ! [దగ్గరగా జరుగుతాడు]

రే :—రాచుకొని కూర్చుంటేనేగాని కూర్చోలేరా ?

రా :—ఉష్ ! అన్నీ నిబంధనలేనా ? తింటె అయిపోతుందేమోనని అట్లానే చేతిలో పండునుపట్టుకొని దానివంక చూస్తూ ఆనందించే కుర్రాడిలా ఎడంగా నిల్చుని నీ దేహపురంగు కండ్ల అందం చూస్తూ ఇల్లా నిల్చిపోవడమేనా ? యీ పురుషసింహం కాలీ హృదయంతో ఇలా అల్లాడిపోవలసిందేనా ?

రే :—ఏమిటండీ ! ఆ వెర్రివాగుడు.

రా :—వెర్రివాణ్ణి చేస్తున్నావ్. అందుకే ఆ పతివ్రతలు కథలు చదువమన్నాను. చూడు ! ఆ నోములకథలు పూర్తిగా చదివేవా ? దానిలోని నోములు పట్టు. పరంకోసం యిప్పట్లోనే పాటుపడాలి, పిచ్చిపిల్లా...

రే :—[తనలో] ఇక నా బ్రతుకే నోములమయం.

రా :—ఇదిగో...చూడు ! ఆ ప్రక్కయింటి ఆమె కొడుకు ఎంత చక్కగా చూడడానికి ముద్దేసుకొస్తాడో ! ఏం ? మనకుమాత్రం అంతకంటె కూడ మంచి పాలబుగ్గలు, ఎర్రని సన్నపెదవులు, ఇంకా దబ్బపండులాంటి శరీరచ్ఛాయతోనూ ఒక్కకాయ నీ కడుపున కాసిందంటే మన యిద్దరిమధ్యా ఆ పిల్లాడు తాయిలం

కోసం ఏమనుకుంటే చూడు రేవతీ! అప్పుడు నువ్వేమిచేస్తావో చెప్పు?

రే:—అదొక్కటి తక్కువ ఈ నిర్జీవ బ్రతుక్కి....

రా:—సహజమైన యౌవన భావోదయం నీలోంచి లేచిరాదేం! అలా ఏమిటో యోచిస్తూ నిన్ను నీవే మరచినట్లు అగుపడతావ్. కులాసాగా ఒక్కగంట మాట్లాడవుకదా! ఏదో తప్పనిసరి అయినట్టు ముప్పతిప్పలూ పెట్టి, ఎప్పటికో స్వాధీనం తప్పినట్లు శరీరాన్ని వప్పగించి ఊరుకుంటావు. భర్త అనేవాడికి సౌఖ్యం కూర్చడం నీ ధర్మం అంటావా! కాదా?

రే:—ఏమిటండీ! ఇహాకబుర్లకి వేళాపాళా అక్కర్లేదు! ఏదో కాస్సేపు 'రామా కృష్ణా' అనుకోమన్నారుగా! మళ్ళీ ఈ అల్లరేమిటి!

రా:—భర్తయే పరమదైవం అన్న సంగతి ఆ హరికథదాసు చెప్పడం నీవు వినలేదూ! నేను వచ్చేటప్పటికి ఆ భక్తి విరమించి రక్తిలోకి దిగాలి. రా...ఇలా కూర్చో- [అని చేతినిపట్టుకొని ప్రక్కను కూర్చుండబెట్టుకొంటాడు.]

[కేశవుడు కాగితముల ఫైలుతో ప్రవేశం]

కే:—[శాస్త్రిని, రేవతిని చూచి నాలుక కరుచుకుంటూ వెనుకకు తగ్గి ప్రక్కగా ముఖం త్రిప్పుకొంటాడు] [తనలో] ప్రణయ సమాధిలో వున్నట్టున్నాడు చిలకముందు జముడికాకిలా! ఆ పిల్ల ఆతనితో అసలు మనసిచ్చి మాట్లాడినట్లే కనబడదు. జీవంలేని జీవయాత్ర చేస్తోంది ఆతని చేతిలో. ఎప్పుడో సమయం చిక్కినప్పుడు రెండవకంటికి తెలియకుండా 'టఫ్' మని ఎగిరి చక్కాపోయి ఊరుకుంటుంది. [ప్రకాశంగా] పంతులుగారూ!

రా:—[వెనుతిరిగి చూస్తాడు. రేవతి లోనికి పోతుంది] వీ డొకడు

సమయానికి 'రికరింగు డిసమల్' లా ప్రతి-చోటికి తయారు!
[ప్రకాశంగా] ఏమిటోయ్ బాబూ! పుట్టిమునిగి పోయినట్టు సరిగ్గ సమయం చూచుకొనే ప్రత్యక్షమౌతావ్?

కే:—చిత్తం. ఈ టైములో...పగలు...యీపరిస్థితుల్లో ఉంటారని నాకు తెలియలేదండి.

రా:—అంటే—పరిస్థితులు తమకు ముందుగా విన్నవించుకొని మేము ఉపక్రమించాలన్నమాట.

కే:—చిత్తం—

రా:—ఏమిటి చిత్తం!—నీ తలకాయి! ఊఁ...ఇప్పుడేంకావాలేం?

కే:—వీటిమీద తమ దస్కత్తులు అవసరమండి.

రా:—ఇలా తగలడు. [రికార్డు తీసుకొని దస్కత్తులు చేస్తుంటాడు]

కే:—[వెనుకనుంచి చేతులు సలుపుతూ] ఆడదాన్ని మోహింప చేసి, లాలించి, తృప్తిపరచడం తమకే తెలుసని చెప్పాలండి.

రా:—[నవ్వుతూ క్రిందిచూపుతో కనుబొమ్మలు పైకెత్తి] ఆరి బడవా! నువ్వోలా గ్రహించావోయ్?

కే:—కనబడుతూనే ఉందండి. నిరంతరం ఉన్నతమైన రొమేన్సుకోసం వెతికే తమహృదయాన్ని చూస్తే నాకు మహాగర్వమండి.

రా:—[చిన్ననవ్వుతో] లేకపోతే నాయక్స్పీరియన్సు అంతా నేల పాలు కావలసిందేనా! చూసేవా! నిమిషంలో అంత పెంకిదాన్ని నాచేతులలో ఏలా యిముడ్చుకున్నానో! రామశాస్త్రిగారంటే మజాకా యేమిటోయ్! ఇదిగో రావ్! మా ఆవిడమాటలు ఎంత మధురంగా ఉంటాయనుకున్నావు. అస్తమానం నాతో ప్రేమ మాటలే మాట్లాడుతూంటుంది.

కే:—అవునండి. షెర్లీ టెంపుల్ మాటలుకంటే ఆమె మాటలే మధురంగా ఉంటాయని చెప్పాలండి.

రా :—[దొంగనవ్వుతో] నువ్వేలా విన్నావయ్యా ?

కే :—అప్పుడప్పుడు వింటూనే వుంటానండి.

రా :—[నవ్వును మాయంచేసి కోపంతో] వినకూడదని చెప్పలేద టయ్యా ! నువ్వేం మనిషివికానట్టు కనబడతావే !

కే :—చిత్తం. చూడకూడదన్నారుగాని, వినకూడదని చెప్పలేదు కదండి !

రా :—చెప్పనవన్నీ చేసేస్తూంటావన్నమాట!—చూడూ ! నీవు ఆఫీసు గది అవతలకు మార్చినట్టేగదూ !

కే :—చిత్తం. ఆవేళే కాళీ చేయించి మార్పించేనండి.

రా :—నీవు అస్తమానం లోనికి పరిమిషన్ లేకుండా రాకూడ దయ్యా ! ఇదేం ఆడవాళ్ళు ఉండేకొంపని తెలుసా !

కే :—[తనలో] ఉంటే కొరుక్కుతింటావూ ?

రా :—ఏం మాటాడవు ?

కే :—మీపర్మిషన్ పొందడానికే లోపలకు వస్తూన్నానండి.

రా :—లోపలకువచ్చి పర్మిషన్ పొందడం ఏమిటోయ్ !—ఊఁ ! వెళ్ళు పనివుంటే కబురు పంపించు. ఆఫీసుగదిలోనికి నేనే వస్తూంటాను.

కే :—అలానేనండి. ఇహ నే వెడతానండి— [ముందుకునడవబోతాడు]

రా :—ఊఁ ఇదిగో—ఇలారా ! [అతనిని క్రిందినుంచి పైకి పరికించి కనుబొమ్మలు ఎగురవేస్తూ] నన్నపంచలు కడుతున్నావే ?

కే :—ఇక ముతకపంచలే కట్టుకొస్తానండి. [మళ్ళీ వెళ్ళబోతాడు]

రా :—మరిచేను చెప్పడం. ఇదిగో—ఇలారావయ్యా !

కే :—[వెనుదిరిగి] ఏమండి !

రా :—ఏమీ లేదుగాని- ఆ వంటవాణ్ణి రేపటినుంచి పనిలోనుంచి తగ్గించు. వాడికి బదిలీ ఎవరినైనా ఒక ఆడదాన్ని కుదుర్చు. ఓ రెండు రూపాయలు ఎక్కువైన ఫరవాలేదు.

కే :—ముసలి వంటవాడినైనా కుదర్చమంటారా ?

రా :—ఆలాపనికిరాదు. ఓనాలుగు ఎక్కువైనా ఒకఆడ వంటమనిషినే చూడు. ఆమాత్రం చూడలేవోయ్ వెధవకబుర్లుచెప్తావ్ !

కే :—చిత్తం . . చూస్తానండి. ఇంకా ఏమైనా మార్పులున్నాయాండి !

రా :—చెప్పినవిచేద్దూ ! తక్కినవన్నీ నేను చూసుకుంటాను. ఊ- ఇక దయచెయ్యి !

కే :—చిత్తం.

[కేశవరావు నిష్క్రమిస్తాడు. తెరపడుతుంది.]

—:•:—

# 7 వ రం గ ము

[లీల కూర్చొని ఉంటుంది. తెరలేస్తుంది.]

## 9 వ అ ను బం ధం

లీ :—

తే. గీ. తల్లిదండ్రులు చేసిన తప్పులరయ
అనుభవింపంగ వలెనట వారి సుతలు
సంఘసంస్కార మీరీతి చాలవటుకు
హద్దుచెడె నెవ్వ డిద్దాని నడ్డగలడో ?

నా జీవితంలో మధురతలపులు లేవదీస్తూ మరల నాలో కోర్కెలను చిగిరింప చేస్తూన్నారు. కాని — ఓ వేళ ఆయన సరళ హృదయంతో స్వీకరించినా ఆతని తండ్రి ఒప్పుకొంటారని నమ్మకం ఎక్కడిది! తన మిత్రులు కూడా వ్యతిరక్త మగుచున్నట్లు సూచాయగా తెలుస్తూనే ఉంది. [ఓనిమిషం ఆగి] నాకోసం ఆయన్ని చిక్కులుపాలు చేయడం నా కిష్టంలేని పని. ఇక్కడ నుంచి నేను ఏలా తప్పించుకొని పోగలను? నాబుజంమీద వ్రాకిన చీమను కూడా ప్రేమిస్తున్నా రాయున. ఆయనకు ద్రోహం చేయడమా? — లేక ఆతనిని ఈ విషమ సమస్యనుంచి దరిచేర్చి కష్టములబారినుంచి తప్పించడమా? [యోచనతో] నా తల్లి చేసిన పాపానికి నేనే ఆ ప్రతిఫలం అనుభవిస్తాను. తిరిగి ఆయనను కూడ దరిలేని ఈనరక కూపంలో త్రోయడమెందుకు! ఆయన మాటలు వింటూంటే ఎండిన మోళ్ళు — ఆత్మలూ ఎక్కడో చిగురిస్తాయి. ఆయనతో గడిపిన ఆ అదృష్టదినాలు అమూల్య కాలాలు తిరిగి రావేమో!—

[అరువది ఏండ్ల వయసుగల వాసుదేవరావు పండిత వేషధారణతో ప్రవేశం. ఆతనిని చూచి లీల సగౌరవంగా నిలుచుంటుంది]

లీ:—[అడకువతో] దయచేయండి. వారు బయటికు వెళ్ళారు. ఇప్పుడే రాగలరు — కూర్చోండి.

వా:—[కండ్లలో ఆశ్చర్యాన్ని చూపుతూ] ఎవరి అమ్మాయివి నీవు? ఈ మోహానునికి నీవు ఏమవుతావ్?

లీ—:[సందిగ్ధంగా]—ఆయన...

వా:—ఊ! — ఆయనే! భర్త అవుతాడా?

లీ:—కాదు — ఆపదలో చిక్కి తలదాచుకోడానికిరాగా రక్షించి ఆశ్రయమిచ్చిన...

వా :—నీకు వివాహమైందా ?

లీ :—లేదు.

వా :—అవివాహితవగు నీవు ఒక యావ్వనుని యింటిలో తలదాచుకోడానికి చేరేవంటే ప్రపంచం విశ్వసిస్తుందా ?

లీ :—నేను ప్రపంచానికీ సంఘానికీ దూరమైనదాన్ని. వాటితో...

వా :—అంటే ! బరిదాటిన మనిషివన్నమాట ! నీతి నియమాలతో నిమిత్తం లేకుండా కుర్రగాడిదలుండె స్థలాలకు చేరుకొని, వాళ్ళను చెరచి, వాళ్ళవల్లవచ్చే సంపాదనలతో...

లీ :—ఏమి మాట్లాడుతున్నారుమీరు ! తెలియని స్త్రీని చులకనచేసి మాట్లాడడం మీవంటివారికి ధర్మంకాదు. కూర్చోండి వారు యిప్పుడే రాగలరు. మీపనులు మీరు చూచుకొని వెళ్ళడం మీ ధర్మం.

వా :—ధర్మం !...ధర్మం శీలం, న్యాయం తెలుసుకొనే ప్రవేశం చావా ఈ యింటిలో !

లీ :—[భయంతో చూస్తూ] అయ్యో ! నిష్కారణంగా నిరపరాధినగు నన్ను దూరడం...

వా :—నీవు నిరపరాధివా ? నావంశానికి చిచ్చుపెట్టవచ్చిన మహమ్మారివి కదూ నీవు ?

[మోహన్ ప్రవేశం]

లీ :—[మోహనుని రాకతో కండ్లు తడిపెట్టుకొని చూస్తుంది.]

మో :—[తండ్రినిచూచి] నాన్నగారూ ! ఎంతసేపయింది మీరువచ్చి !

వా :—నాన్న ! నీకు నాన్నఅనే ఆప్తబంధువు వున్నాడనే గుర్తులో ఉన్నావా ? మంచిది...సంతసం.

మో :—మీరు క్రొత్తగా మాట్లాడుతూన్నారు.

వా :—మాటలేకావు. నేనే క్రొత్తగా అగుపడుతూన్నాను నీకు.

మో :—[లీలవంక చూచి] లీలా ! నీవు లోపలికిపద. [లీలనిష్క్రమణం]

వా :—ఈలీల ఎవరోయ్ !

మో :—అడిగి తెలుసుకొనే ఉంటారుగా! మళ్ళీ ఆవిషయం నన్ను అడగడం ఎందుకు !

వా :—ప్రపంచంలో నిమిత్తంలేని పడచు నని చెప్పింది.

మో :—అవును. కండ్లులేని ప్రపంచంచేత తరుమబడిన అనాథ ఆమె. ఆమెను రక్షించాను. ఆమె జీవితం కుదుట పర్చడానికే యోచిస్తున్నాను.

వా :—ఇహ యోచన ఏముంది ! అన్నిటికీ ఆపద్బాంధవుడవు నీవే ఆమెకు.

మో :—నాన్నగారూ ! ఆమె జీవితాన్ని గూర్చి వింటే మీరిలా మాట్లాడరని నాకు పూర్తిగా తెలుసు.

వా :—తెలుసు ! అంతా విన్నాను. క్రొత్తరుచుల్ని చవిచూస్తూన్న నీ జిహ్వకు స్నేహితుల హితబోధలు కూడ హితవుకావడం లేదని కూడ తెలుసుకొని పాడలుతూ పరుగెత్తుకొని వచ్చాను.

మో :—అవసరమైతే నేనే వచ్చియుందును కదా నాన్నగారూ ! అంతతొందరపడి...

వా :—ఎట్టివాడవు ఎంతవాడవయ్యావురా ! నీవే యిలాప్రవర్తింప సమకట్టేవంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. ఈపాడుముండతో యింత బహిరంగంగా కాపురమే ! వాసుదేవరావుగారి పుత్రుడు అపవిత్రుడై బజారుస్త్రీతో - రామ ! రామ ! రామ !

మో :—అకారణంగా యితరులను దూషించకండి. ఆమె పవిత్రురాలు.

వా:—కల్లబొల్లి మాటలను ఆత్మచరిత్రలుగా అల్లుకొని పాఠాలుగా వల్లించే ఈ పిశాచుల మాటలలో నియమం, నీతి ఉందని నమ్మి, వాళ్ళకు లొంగి అవివేకంగా యింట్లో తావిచ్చి ..

మో :—అంతమాత్రంలో తప్పేముంది! కష్టంలో చిక్కిన ఆమెను రక్షించి ఆశ్రయం చూపడం అపచారమే అవుతుందా?

వా :—కాదామరి! లోకం అంతా కోడై ఎలా కూస్తోందో గ్రహించావా?

మో :—గ్రహించాను.

వా :—గ్రహించేనా ఈ పాడుపని!...

మో :—గ్రుడ్డిలోకంతో నాకు నిమిత్తంలేదండి.

వా :—ఆ! ఆ!! ...ఏమన్నావ్!...లోకముతోనే సంబంధాన్ని తెగగొట్టు కొంటూన్నావా?

మో :—[నిశ్చల హృదయంతో] ఆమె కోసంఏమైనా చేయదలచాను. న్యాయంకోసం, ధర్మంకోసం ఎవరినైనా ఎదిరించదలచాను.

వా :—ఆరి పిడుగా!...అయితే దానిని కొంపలో పెట్టుకోడానికే నిశ్చయించావన్నమాట! ఇహవంశం, పరువు, మర్యాద అక్కర్లేకుండా హద్దుమీరదలచావన్నమాట! ఈ విధవ డిగ్రీలతో స్వతంత్రుడవయ్యావనుకొంటూన్నావు.

మో :—నాన్నగారూ!...ఆమె నిష్కళంకిత అని నేను గట్టిగాచెవుతూన్నాను. నమ్మండి. ఆమెను ఆదరించడంకంటే ధర్మం వేరొకటి లేదని...

వా :—ఆపదలలో చిక్కిన అనాధలను రక్షించడానికి కంకణం కట్టుకొన్న అపరధర్మరాజువు కాబోలు నీవు? సిగ్గులేదూ?...

చేసిన పనికి సిగ్గుపడి శిరస్సువంచకుండా వెకిలిమాటలు మాట్లా డుతావేం! దాని తీపిమాటలకు, నటనకు దాసుడవై దానిని నా ఎదుటనే పొగడ సాహసిస్తూన్నావా ? పండంటి వంశానికి శాశ్వతపుమచ్చ తీసుకొనిరాబోతూన్నావని తెలుసుకొన్నప్పుడు ఈ ముసలిస్థితిలో ఎంతవిచారపడ్డానో తెలుసా ?...

మో :—క్షమించండి. ఆమెకు మాట యిచ్చాను.

వా :—ఏమని మాటయిచ్చావ్యడం !

మో :—ఆమెను రక్షించి కాపాడుతానని.

వా :—అంటే !...ఆమెను తనవారి యింటికి చేర్చుతానని మాట యిచ్చావా ?

మో :—తనకీ ప్రపంచంలో 'నా' అనువారే లేనప్పుడు ఎక్కడికి చేర్చడం ?

వా :—ఐతే...ఆమెను కాపాడువిధానం ?

మో :—త్యాగబుద్ధితో వివాహమాడి ఈ జాతి స్త్రీలకు యిహ ముందైనా న్యాయం దొరికేలాగు...

వా :—ఆ! ఆ!!...వివాహమా ? దానితో వివాహమా ? వివాహం చేసుకోవడమే ? ..

మో :—అవును. పాపపుణ్యములు ఎఱుగని అనాథలను అన్యాయంగా సంఘం బహిష్కరించడం అధర్మం అని ప్రపంచానికి తెలిపి, ఆదర్శప్రాయుడ కావాలనే ఈమెను వివాహం చేసుకొన స్థిరపరచుకొన్నాను.

వా :—బ్రాహ్మణకుల మహాపాతకా ! అనాదిగావచ్చే మతధర్మాలను మంటగలప స్థిరపరచుకోవడం పెద్ద ప్రయోజకత్వమనే గర్వపడుతున్నావా ? నీ భావిజీవితంమీదకే దాడి సల్పడం అని గ్రహించలేక పోతున్నావ్ !

మో :—ఏ ఆపదలనైనా సంతోషంతో ఎదిరించి న్యాయంకోసం నిలబడదలచాను.

వా :—[కోపంతో] పశువా! పడపు స్త్రీ మాటలు నమ్మి దాని అందానికి మురిసి, దాని తమాషాలకు తన్మయుండై, దాని మాటలే బ్రహ్మవాక్కులుగా గణించి, యింటిలో తావిచ్చి చివరకు దానినే త్యాగమనే పేరుతో పెండ్లి చేసుకొని సంఘానికి ఆదర్శప్రాయుడ వౌతావా! పసితనాన్నే భర్త మరణించిన విధవబాలికను పెండ్లిచేసుకొని సంఘానికి ఆదర్శప్రాయుడ నౌతానంటే కొంత అర్థం ఉంది. కాని— ఇదేమిటి? ఒక పడుపు స్త్రీకి జన్మించిన యువ్వనిని వివాహమాడి సంఘాన్ని మరమ్మత్తు చేదామనుకోవడం కేవలం వెర్రితనంకదూ!

మో :—తల్లిచేసిన పాపాలకు ప్రతిఫలం ఏ పాపం ఎరుగనివారి పాపాలు అనుభవించాలనే క్రూరసిద్ధాంతాలను నేను వప్పుకొనలేను. ఆమె నిష్కళంకిత అని నాకు నా మనస్సేగట్టిగా చెపుతోంది. అదిగాక తల్లిదండ్రులు చేయుపాప ఫలం వారి బిడ్డలా అనుభవించడం! సంఘంవారి సంతతి వివాహాలకు అడ్డుపరచి 'వెలి' వేయడం అవినీతికి దారి చూపడంకదూ! వారికి చేయూత యివ్వడమే హేయమైనప్పుడు వారి జీవితాలు అధోగతికావలసినదనేనా సంఘంయొక్క సిద్ధాంతం! చేతులార, వారిని తరిమి నరకకూపంలో త్రోయడమేనా సంఘంయొక్క ఆశయం!

వా :—హూ!—రక్కెస చెట్టుకి గులాబిపుష్పాన్ని ఆశించడంఅన్న మాట!

మో :—ఏం! ధర్మప్రభువైన అంగరాజుకు దుర్మార్గుడగు వేనుడు పుట్టలేదూ? దుర్మార్గుడగు రక్కసుని కడుపులో భక్తుడగు ప్రహ్లాదుడు పుట్టలేదా?

సీ. తల్లి కులటయైన తనయుడు జాబాలి
పూజ్యులలో పేరు బొందలేదె
నారదుతల్లి యనార్యయై బరగిన
హరిభక్తి దుర్యుడై యలరెగాదె
పంచమజాతిలో ప్రభవించి నందనార్
ఆళ్వార్ల సమితిలో నమరలేదె
కడునీచకృత్యాల గావించు దుర్మతి
వాల్మీకిఋషియని వాడలేదె

గీ. కులముతో నేటిపని జూడ గుణముగాదె
గుడ్డయెద్దయైన రంగున కోటిసేయు
తల్లి తప్పుల తలపెట్టి తనయునిట్లు
తూలనాడిన నాపెకు త్రోవగలదె?

వా :— ఓహో ! సంఘానికి కూడయిట్టిమాటలు చెప్పి కండ్లుమూయ దలచుకొన్నావా ?

మో :—సంఘం ! బ్రహ్మరాక్షసిలా నోరుతెరచుకొని నిరాధారులగు ఆపన్నుల మీదికిమాత్రం విరుచుకుపడే సంఘానికి ఆమెను స్వయంగా బలియివ్వలేను అధికారపశువుల కఠినమైన గిట్టల క్రింద నలిపి ఆమెను నశింపచేయడం నాకిష్టంలేదు. సంపన్న గృహస్థుల యిండ్లలో ఎందరెందరు విధవరాండ్రు గర్భములు దాల్చి, సంఘ భీతిచే గర్భవిచ్ఛిన్నము చేసుకోవడమో ! లేక — ఆ పసిపాపల ప్రాణాల్ని హరించడమో, లేక— ఆ నింద ప్రాణానికే హానికలుగ చేసుకోవడమో జరుగుచుండడంలేదు ! భర్తలు ఉండికూడ ఎంద రెందరి గృహాలలో స్త్రీలు వ్యభిచరించడంలేదు ! నాగరికత అనే పేరుతో ఎంతెంతటి ఘోరాలు జరిగిపోవడంలేదు !... ఈవిషయ ములు వేయికండ్లతో గమనిస్తూన్న సంఘం వారిని వ్రేలితో చూపి

తన నిబంధనలు వారిపై వెదజల్మి కట్టివేయలేదేమి ? వారి చుట్టు పట్ల చేరుటకే సాహసించలేని సంఘం నిరాధారులపై మాత్రం ఎడతెగని శాశనాలతో ముందంజవేసి 'వెలి' అను శబ్దం భూన భోంతరాళాలు విజృంభించేలాగున శంఖధ్వని చేస్తుంది. అట్టి సంఘ నియమాలు నాకు సమ్మతముకాని పని.

వా :—ఉద్ధరించబయలు దేరిన కలికావతారం కాబోలుయిది!

మో :—నాన్నగారూ! ఈ విషయంలో కలుగచేసుకొనవద్దని చెప్ప సాహసిస్తూన్నందుకు క్షమించండి.

వా :— [యోచనగా] స్థిరపరచుకొన్నా వన్నమాట! ఊ! ఐతే— నిలకడగా అది నీతోనే ఉంటుందని నమ్మకం ఏమిటి? త్రాడు బంధంతో తర్లిపోకుండా నీతోనే అది...

మో :—ఆమెమీద నాకు నమ్మకంవుంది. ఆమె శీలంలో నాకు గౌరవం ఏర్పడింది. ఆమె నన్ను గాఢంగా ప్రేమించిందని కూడా నాకు తెలుసు. ఆమె ప్రతిమాట నన్ను ఆకర్షించి—

వా :—ఆమాటలూ – చేష్టలూ వారికి వెన్నతో పెట్టిన విద్యలు కదూ! పచ్చగాఉంటే పడుపుకత్తెలు ప్రేమించడానికేం! ప్రాణాలు కూడా యిస్తామంటారు పని తీరేవర్కు. నీవలె నిలకడగా మాట్లాడి నిలువగలదని మాత్రం నమ్మడం పొరపాటు.

మో :—నానిశ్చయాన్ని మార్చుకొన అశక్తుడను.

వా :—ఐతే—నీక్షేమంగోరి చెప్పే నీ స్నేహితులు నీకంటె తీసిపో యినవారా? నీచదువు-నీజ్ఞానం- నీవివేకం ఎక్కడ దాచి వుంచావ్! ఈముసలితండ్రి మాటలయందైన విశ్వాసముంచి...

మో :—నాన్నగారూ! మీపాదాలంటి ప్రార్థిస్తాను. ఈసత్కార్యం చేయడానికి నాకు అవకాశం చూపండి.

[శేట్ ప్రవేశం]

శే :—మోహన్ బాబుగారు ఉందీ లేదూ ?

మో :—[శేట్ వంక తిరిగి] ఏం—శ్యామలాల్ శేట్ ! చెప్పానుకదూ ఈనెలాఖరున యిస్తానని.

శే :—నాల్గవనెల చల్లగా జరిగి నడచిపోతూంటే, మళ్ళీ వాయిదాల్ మీద వాయిదాలు వేస్తే మాదీ వ్యాపారం ఏలాగునసాగేది సెప్పండీ మీరే ! ఘురానాసాబ్ లని నేను అడగకుండా గప్ చుప్ గా ఊరుకుంటే మీరు...

మో :—నెలాఖరున యిస్తానన్నానుగా ! ఒప్పుకొని మళ్ళీ ఈపోదం తాపమిటి ? తరువాత నీకొట్టుకువచ్చి మాట్లాడుతాలే వెళ్ళు.

శే :—వెళ్ళిపోడానికి వచ్చాను అండినేను ! మాదియిల్లు నాల్గుదినాలలో కాళీసేసీ జరూర్ గా యిక్కడనుంచి లేచిపోవాలిమీరు. ఈలోపుగానే అడ్డిపైకం చెల్లించి మరీ కదలాలీ అండి మీరు.

మో :—[కోపంగా] ఏమిటోయ్ నీవు మాట్లాడుతూండేది ?

శే :—అరే ! నామీద కోపం చేస్తారేమండీ ? ఇల్లు కావాలీఅంటే ! మీఒక్కరికోసం అద్దెలు ఖరాబ్ చేసుకొని వ్యాపారం దివాళా తీసుకోవాలీఅంటారా అండి మీరు ! నాయంచూడాలి కదండి మీరుకూడ.

మో :—నీమాటలు నాకర్థంకావడంలేదు.

శే :—ఒక ఔరత్ ని తెచ్చి యింటిలో నాట్యంఆడి, హిల్లుఅంతా గలాటా పరచి కరాబ్ చేస్తూఉన్నారని ప్రక్కవాళ్ళంతా ఏక్ దమ్ కాళీ చేస్తామని మాకీతెలియపరుస్తూంటే, మేమూమాత్రం ఏమిసెయ్యాలా సెప్పండి ?

మో :—అట్టివి ఏమీ యిక్కడ జరగడం లేదే ?

శే :—హోడదిడుంది మీాది యింటిలో రాత్రిలు పగలు అని, అంతా సెపుతూంటే, లేదంటే మేముమాత్రం ఏమి సెయ్యాలా సెప్పండి !...

వా :—[చెవులు మూసుకొని] రామ- రామ-

మో :—[కోపంతో] ఆమె అట్టిదికాదు. నీవు అవతలకు నడు ముందు.

శే :—మీారు కోపంసేస్తే మాది హక్కుమీాద ఏమి న్యాయమండి?

మో :—సరే! కాళీ చేస్తానులే పో!...

శే :—నాల్గు దినాల్లో కదలకపోతే బరాబర్ కోర్టువార్కి తెలిపి మిమ్మల్ని—

మో :—సరే. వెళ్ళమన్నాను కదోయి నిన్ను...

శే :—[వెళుతూ వెనుకకు తిరిగి] అద్ది సీదాగా చెల్లుపెట్టకపోతే సామాను కదలదు తెలుసుకోండి సాబ్ !

[శేట్ నిష్క్రమిస్తాడు]

వా :—ఎంతవాడి కొడుక్కి ఎంతగతి పట్టింది ! నాకండ్ల ఎదుటనే నాకొడుకుకు బహిష్కారం.

మో :—లోకం గ్రుడ్డిదని చెప్పానుగా !

వా :—విన్నావుగా...మనస్సితి ఎంతవరకు వచ్చిందో ! ఉండడానికి యిల్లు లేదన్నారు. రేపు ప్రొద్దుట పొరుగూరు వెళితే నిప్పూ నీరూ కూడ పుట్టకుండ పోతుంది.

మో :—అట్టి చాందసుల అంధత్వాన్ని బాపడానికే యిప్పటి నా నిశ్చయం యిహా మొదటి ప్రకరణం ప్రారంభ మైందన్న మాట...

వా :—[నిశ్చలంగా నిలచి] అరేయి! నీతండ్రినవడంవల్ల పితృస్థానంలో నిలచి చెప్పబోతున్నాను విను. ఈ కళంకానికి తాళుకోలేక ఈ ముదుసలి ఈస్థితిలో ఎప్పుడో 'హార్ట్' అంటాడు. నా మీద నైన కనికరముంచి దానిని యిక్కడనుంచి తగిలివేయి. కావలిస్తే దానిపోషణకు కావలసిన పైకం నేనుయిస్తాను.

మో :—క్షమించండి! త్యాగం చేసి భారతమాతకు అనుంగు పుత్రుడ కాడానికి అదునువచ్చింది. ఈ అవకాశం పోగొట్టుకొనలేను.

వా :—పోగొట్టుకొనలేవా? నీ త్యాగానికి నీ తండ్రిని కూడ బలి యివ్వదలచావా? పుణ్యపురుషుడవు కాబోతున్నావని నా కడుపున చిచ్చుపెట్టడానికే సాహసిస్తున్నావన్నమాట. తండ్రిని పూజించాలనే పూజ్యభావాన్ని పూజ్యంచేసి అహంకార బుద్ధితో అల్లాడుతూ, త్యాగమనే మాట పట్టుకొని ప్రాకులాడుతూ—

మో :—నాన్నగారూ! నాలో పితృభక్తి లేదనడం న్యాయమా? మీ పాదధూళినే పరమపవిత్రంగా ఎంచుతూ...

వా :—ఛీ! బ్రాహ్మణకులద్రోహీ! నీవు నాకు కొడుకువే కాదు. నీవు నాకు పుట్టనేలేదు. పుట్టినా యిప్పుడే చచ్చిన వాడితో సమం. పూజ్యుడైన కొడుకును నోచుకోని లోపం నాదేలే. నిన్ను అనవలసిన పనే లేదు...

మో :—నాన్నగారూ!...

వా :—అలా పిలచి నన్ను అపవిత్రపరచకు. ఇదిగో! ఆఖరిమాట చెపుతూన్నాను విను. ఈమెను విడచితివా సరే. లేదా! నా ఆస్తిలో ఒక్క గవ్వ అయినా నీకు ముట్టదని గట్టిగా చెపుతూన్నాను విను. నీకు చెందడంకలు పధర్మ కార్యాలకో విని యోగ

పడడంలో నాకు పరముంది. గాన యోచించుకో. నాకు వ్యతిరేకమైతే...

మో:—నాన్నగారూ! మీ మోక్షసాధనంకోసం ఆ ఆస్తిని పుణ్యకార్యాలకే ఉపయోగించండి. నాకా ఆస్తిమీద ఎన్నడూ ఆశలేదు. మీరు ప్రసాదింప చేసిన ఈవిద్యయే నాకు పరమధనం. కాని ఒక్కటి మాత్రం కోరుతూన్నాను. అది తమదయను మాత్రమే.

పా:—దయ!— ప్రేమ!— నాదయతో నీకేమిపని ఉంది! సరే నే వెడుతున్నాను.

మో:—[చూస్తూ] నాన్నగారూ!— నాన్నగారూ— ఒక్కపూట ఆగరూ?

[తండ్రి వెనుక మోహన్ నిష్క్రమించును.]

[లీల ప్రవేశము]

లీ:—[కంటనీరు జారుస్తూ] ప్రపంచంలో నావంటినిరర్థక జీవులు పుట్టడమేతప్పు. పుట్టి జీవించడమే చేటుఅంటాను. జీవించియుండడం సంఘానికేకాదు...లోకానికేకాదు... జాతికేకాదు... మతానికేకాదు ప్రపంచానికే చీడపురుగులు. సంఘంచే బహిష్కరింపబడి నలుగురుఅనే మాటలకు కుళ్లిపోతూతమఅందాలిన్నీ, తమ కోర్కెలిని తమలోనే యింకించుకొంటూ, కుంటిజీవితంగడపాలట! ఎవరూకూడ నేనుచెప్పే మాటలనుగాని, అనుసరించే మార్గాన్ని గాని హర్షించనప్పుడు జీవితం నిరర్థకంగాక ఏమౌతుంది! నాకళంకం నాతోమాత్రమే నశిస్తుంది. [ఓనిమిషం ఆగి] కాలితో తన్ని పారేస్తూ, జోడుతో నలిపేస్తూ, నోటితోనలుగురిలోను కనబడకుండ కుమిలించేస్తూ, సంఘంపేరిట తమఆనందంకోసం సౌఖ్యంకోసం ఒరులను హింసిస్తూ, వాళ్ళు బాధపడుతూంటే

తమ లలిత హృదయాల్ని రాతిగుండె చేసుకొని వికటహాస్యం చేయడం వారి లక్షణం కాబోలు ! తమ స్వార్ధపరత్వమే పరమావధి అనుకొని, తమ బాగోగులే తమ కార్యాలనుకొని, తమ కష్టాలే తమ బాధ్యత లనుకొనే వారేతప్ప సంఘంలో విశాల హృదయంగల సంఘసంస్కర్తలే యిహ లేరా ? [రుద్ధకంఠ స్వరంతో] పాపంలోపుట్టి, పాపంలో పెరిగి, పాపాన్నే సేవించి, ఆ పాపంతోనే అంతరించడం కంటె నాబోటి స్త్రీలకు మార్గదర్శకురాలనై ఒరులకు నావల్ల చీమంతైనా నొప్పికలుగకుండ అంతరించడం మంచిది. అప్పుడు సంఘం నన్నుచూచి హర్షిస్తుందో, గర్విస్తుందో, నవ్వుతుందో నగుబాటు చేస్తుందో !— [ఓనిమిషం ఆగి నిట్టూర్పుతో] హూ !— ఏమిచేసినా ఆమాడిపోతున్న మోహన్ హృదయానికి శాంతిని చేకూర్చిన దాననవుతాను. చివరకు స్నేహ బృందంవల్లసహితం నిందింపబడుతున్నారు కాబోలు ఆయన నాకొరకుపాపం. నాప్రేమతో ఆయనను ఆరాధిస్తూ నాప్రాణాలు సంతోషంతో విడచి కళంకం బాపుకొంటాను. ఇంతకంటె నాకు వేరు మార్గం అగుపడదు. [డ్రాయరులోని బాకు తీసుకొని వక్షమునకు గురిచూచి ఎత్తి]

మ. ప్రళయార్కానల భాసమాన సమరోద్రాగ్ని చ్ఛటాజాల సం
కలితంబై యరివీరకంఠరుధిర గ్రాసంబునై సంతత
జ్వలనజ్వాల సమోష్టమై యలరి సచ్చారిత్రమహాగాదె నీ
కులమో ఖడ్గరు ! సాధ్వీరత్నములకుం కూలంకషంబౌగతిన్.

[పొడుచుకొన బోతుంది.]

[మోహన్ ప్రవేశం]

మో :—[లీలచేతిని పట్టుకొని] ఏమిచేయబోతున్నావు లీలా !— నావల్ల ద్రోహాన్ని తలపెట్టి పోచూస్తున్నావా ?

లీ :—ద్రోహమా !— కాదు. నామార్గాన్ని నేను అనుసరిస్తున్నాను. నావల్ల ఒరులకు హింస కలుగడం నాకిష్టంలేనిపని.

మో :—లీలా !—ఏమి మాటలవి ! నీకోసంకదూ సర్వత్యాగంచేసి కులట సంతతిని ఉద్ధరించడానికి కంకణంకట్టు కొన్నది !

లీ : —నా వివాహంతో మీకు కష్టాలు చుట్టుముట్టుతాయని నాకు తెలుసు. గాన ఆత్మహత్యకంటె పరమసాధనం అగుపడక మీ జీవిత సుఖాన్ని కోరుతూ, ఈ ప్రపంచానికి దూరంకాడానికే—

మో :—లీలా! నీచావుతో నాకు శుభం చేకూరడం కల్లగాని, నీ ఆత్మహత్యతో నాకు ఆరని ఆరాటంమాత్రం జీవితమంతా కాల్చడం నిజమాతుంది.

లీ :—అంతమాట అనకండి. నాతోవివాహం సంఘ సమ్మతము కాదని యిప్పటికైనా మీరు గ్రహించాలి. దొంగదానికన్నా నీచురాలిని, హంతకురాలికన్నా దుర్మార్గురాలిని, ముష్టిమనిషి కన్నా అధమురాల్ని, ప్రపంచంలో ఎవరికీ పనికిరానిదాన్ని, నన్ను విడువండి. నన్ను మరువడానికే ప్రయత్నించి పుణ్యం కట్టుకోండి.

మో :—లీలా ! సంఘదాక్షిణ్యంలో నిన్ను విడువ నాకిష్టంలేదు

ఉ. పరివారల్ ననుదూరనీ, విషమమా సంఘంబునన్వ్రేడనీ
పరువౌ వంశము పోయెనంచు పితరుల్ పల్మారు వాపోవనీ
మరియే యే ఘటనల్ ఘటిల్లినను అంబాదేవితోసాక్షిగా
నరయం గల్గెద నెల్ల కాలము నినున్ ప్రాణాధికమ్మానటుల్.

కాన లీలా! పిచ్చిమాటలు మాని నాకోసమైనా నీవు నన్ను పెండ్లి చేసుకోవాలి.

లీ :— మోహన్ !

మో :—నాకు తెలుసు. నీకు యీఊరిలో ఉంటే మనశ్శాంతి వుండదు. త్వరలోనే మకాం మారుస్తాను. చూడు— యీ ఆత్మహత్యా మహాపాతకానికి తలపడనని ప్రమాణంచెయ్యి!

లీ :—మీరు పిచ్చివారు అవుతున్నారు.

మో :—ఆమాటవద్దు. అలాజరుగదని నీచేయినాచేతిలోఉంచు.

[అంటూ ఆమెచేతిని తనచేతిలోనికి లాగుకొంటాడు.]

లీ :—మీనాన్నగారు తిరిగి రానేలేదా ?

మో :—ఆమాటలు నీకుఅనవసరం. రా! భోజనానికి టయిమయింది తరువాత అంతాచెబుతాను. [ఆమెను లోనికిదీసుకొనిపోతాడు.]

[తెర పడుతుంది.]

---

ఓమ్

# రేవతి

## చతుర్థాంకము

### 8వ రంగము

[నదిగట్టువైపు నడుస్తూంటాడు మోహన్. తెరలేస్తుంది]

మో :—ఎంతకాలానికి మరల ఈనదిగట్టును చూడగలిగాను! పుట్టి పెరిగిన ఈస్థలాన్ని విడచిపోవడం కష్టంగనే ఉంటుంది. కాని వెళ్ళక తప్పదు. [ప్రక్కకుచూచి] ఈచెట్లక్రిందనే కదూ ఆ రేవతితో ఆటలాడుకొనేవాణ్ని!

సీ. ఆడితి మిచ్చోట నభినవోదారమా
　　　　　　నాటల నీపూల తోటలందు
　పాడితి మీలపాటల చెట్లకొననెక్కి
　　　　　　కోయిల చలపట్టి కూయనిందు
　దాగితి మీకుంజదాహూల తలపెదొ
　　　　　　తెలియని ముగ్ధత్వ రీతినొప్పి
　కూడినామిచ్చట గోపాల రాధలు
　　　　　　మనముగా కేరని ఘనతమెరసి

గీ. పాటపాడగ చినుకులు పడెడువేళ
　చంద్రకిరణాలు విరజిమ్ము సంజవేళ
　లన్ని వెళ్ళించినాము యదియేరికెరుక
　కాలగతి మీరవశముగా దేరికైన.

ఇపుడు ఆమె మరియొకని భార్య అయి శాంతిజీవితాన్ని సాగిస్తూంది. ప్రాతసంఘటనలను జ్ఞప్తికి తెస్తోంది ఈతురాయిచెట్టు.

[చెట్టుక్రింద రాయిమీద కూర్చుంటాడు]

అదిగో ! ఆ దూరంనుంచి వచ్చుచున్నది—ఎవరుచెప్మా ! ... రేవతి కాదు కదా !...ఈవేళలో...సూర్యాస్తమయ సమయంలో రేవతి ఒక్కతియే నీళ్ళకు...

[రేవతి ప్రవేశం. మోహనునిచూచి అక్కడనే నీళ్ళబిందె విడచి దగ్గరకు నడుస్తుంది]

మో :—[ఆతృతతో] రేవతీ !...

రే :—[నిలువు గుండెలో] ఆ. నేనే !

మో :—ఈవేళలో నిర్భయంగా—ఈ చోటికి...

రే :—అవును. మీతండ్రిగారి చావును విని పరితపించాను. మరి నాలుగుదినాలులో మీతండ్రిగారి ఉత్తరక్రియలు జరిపి ఈఊరు విడిచి నీవు వెళ్ళుచున్నావని తెలసి నిన్నుక్షమాపణ కోరడానికి వచ్చాను.

మో :—రేవతీ ! నీవుజరిగిన దానినిగూర్చి వగచనక్కరలేదు. నీవు ఏమి చేసినావో అది మంచిదనియే నావిశ్వాసం.

రే :—మోహన్ !...ఆశాస్త్రి నాతండ్రిని అప్పులుపాలుచేసి ఫకీరుని చేయ నుద్దేశముతో యుండగా వారినిదరిచేర్ప దలచి అతనిని వివాహం చేసుకోవలసి వచ్చినది.

మో :—మంచిపని చేశావు. ఆవిషయంలో నీమీదనాకెట్టి క్రోధ మూలేదు. నీసౌభాగ్యాన్నే నేనుకోరుతున్నాను.

రే :—మోహన్ !...నిన్ను వివాహంచేసుకొని ప్రేమలతలతో కైలాసగిరిని అందుకొందామను కొన్నాను. మన ఆదర్శజీవితాన్ని ఈ పాడుప్రపంచానికి చూపుదామనుకున్నాను. కాని—

మో :—జరిగినదానిని తలచుకొని ప్రయోజనమేమి ?

రే :—తలచుకోనకుండా ఏలాఉండగలను ?...దినానికి యిరువదినాల్గు గంటలు చాలనిరోజులవి. ఎప్పటివో పూర్తిగా జ్ఞప్తికిరాని సౌఖ్య మునందిన నిమిషాలు తలపునకు వచ్చినప్పుడు నన్ను నేనే మరచి, నీప్రణయంలో ఐక్యమౌతూ, సిగ్గుతో రహస్యంగా మాటలెన్నో మాట్లాడుకొంటూ నిన్నుమనసులో పిలువని రాత్రిలేదు.

మో :—రేవతీ !...ప్రాతవిషయములు జ్ఞప్తికితెచ్చుకొని విచారించ వద్దని నాకోరిక. చూడూ !...నీవిప్పుడు అగ్నిసాక్షిగా పరిణయ మాడబడిన ఒకానొక మహానీయుని భార్యవు. గాన పూర్వవిషయ ములు మరచి సోదరిప్రేమతో మాట్లాడాలి.

రే :—కోపిస్తున్నావా మోహన్ !...లేక మరచే మాట్లాడుతూ న్నావా ?—

చ. జిలిబిలి పల్కులన్ సొగసు జల్కొడి ముద్దులతారుమారులన్
అలరుచు, బాల ! నాకునయి అండజవాహనుడీ జగాననిన్
కలుగగచేసె బోయని ప కాపక నవ్వుచు చేయిచేతిలో
గలుపుచు ప్రేమజూపితి వొకా నొక నాడిట జ్ఞప్తిలేదొకో !

మో :—

మ. లలనా ! ఒక్కనియింట రాణివయి యిట్లన్యాయమార్గాననన్
కలియం గోరుటపాడియే మగని దా కన్గప్పి యీరీతి; నా
వల పుట్టింటికి మెట్టినింటికిని నీ వా దుఃఖమూలమ్ము. నా
వలవంతన్ మది చింతసేయుగదవే వామాక్షి యిప్పట్టునన్.

రేవతీ !—నీవిప్పుడు ఆతని ధర్మపత్ని వన్నవిషయం మరచిమాట్లాడడం అధర్మం.

రే :—అధర్మమా?- నేనుచేసేది అధర్మమా!- ఎవరంటారు అలా? నాప్రణయ సుందర స్వప్నాలను విచ్ఛిన్నంచేసి, గంధర్వలోకంలో దాన్నికిందికి ఈడ్చి, నిర్దయగా నాఅప్రణయమేయ ఆనందాన్ని ధ్వం

సంచేసిన ఆమహాపాతకుడగు ఆముదుసలి కృత్యానికి ఆ అధర్మ దోషం అంటదా?- చూడు- మోహన్!- నీవుఉన్నావుకదా బ్రతక డానికనే తలపు లేకపోతే నేనుబ్రతక పోయెడిదాననే.

మ. పిననాటంగలప్రేమలోదలచినన్ ప్రేమించి లాలింపు మో
హన నీ ప్రేమ సుమంబు ద్రెంచితి న హంకారత్వమే యెంచక
నన్నను వౌరీతి గ్రహింపు పూర్వహృదయా నన్ వేడ్కమాభిక్షకై
నినుప్రార్థింపగ ప్రాణముల్ నిలిపితిగా నిక్కంబుగన్మోహనా!

మో :—రేవతీ!- పిచ్చిదానవుకాకు. నీతల్లి దండ్రుల క్షేమంకోసం నీప్రేమను త్యాగంచేశావు. నీత్యాగానికి నేను సంతసిస్తున్నాను. నీవలెనే ఒక అనాధబాలికను రక్షించి, ఆజాతిని లేవనెత్తడానికి నీయందుగల నాపూర్వప్రేమను త్యాగంచేసి ఆమెనువివాహ మాడాను. గాన- మనప్రేమ వాంఛనీయముగాకుండ సోదరీ సోదర ప్రేమగా మారాలి.

రే :—పరిహాసిస్తున్నావా ? నేను చేసిన కఠినతకు కోపిస్తున్నావా ? నా దేహం కాదు సుమా నీ ప్రేమను గోరింది ! నా ఆత్మ.

మో :—నిన్ను నీవే మోసముచేసు కొంటూన్నావు. మనసుమార్చు కొని పూర్ణవిశ్వాసంతో వివాహంచేసుకొన్న నీప్రియభర్తను...

రే :—ఐతే...ఆతనిని ప్రేమించి పెండ్లిచేసుకొని నిన్నుపూర్తిగమరచా ననేకదూ నీ విశ్వాసం ! నీ రేవతి నిన్ను తన హృదయంలోంచి ఏలా తొలిగించగలదని నమ్మగలిగావ్ !

సీ. శాస్త్రిపై చిత్తంబు జేరినదను కోపు
కట్టెకే యతనింటి కాపురంబు
త్రాడుకట్టినతండు తలపుగట్టితివీవు
త్రాడూడుగాని నాతలపు చెడునె

సకల సంపదలతో తులతూగ జేతు నీ
వ్వా యన్న యుడిగంబు జేయుదాన
చివురు బాహుద్వయిగ జేర్చి కుసుమ్కుటకునై
భావగీతి కలనే బాడుదాన

గీ. మోహనా ! నీదు సొగసునన్ ముగ్ధజేసె
నీదు నేస్తంబు విడచినే నిలచుటెట్లు
తంతిపోయిన మాలిక తావులేని
పూవు మాదిరిగాదె నాజీవితంబు.

మో :—తుచ్ఛసుఖాలకుఆశించి నాలోహృదయక్షోభను లేవదీయకు. రేవతీ ! ఈపాపకార్యంతో నీసతీధర్మాన్ని పోగొట్టుకొని ప్రపంచ ఆదరణతోపాటు భర్త అనురాగానికికూడ దూరమై ఆతనిచేత హీనముగా చూడబడతావని తెలుసుకో !—

రే :—తెలుసు. చావులేదని వరంపొందిన శత్రువుమీద ఏ అస్త్రం ప్రయోగించినా నిష్ఫలమే. నీప్రేమను అందుకోడానికి చూడు ఏమైనా చేయగలను.

సీ. శాస్త్రితానేమైన శంకించు నందు వా
పులి మేకలకు మైత్రి కలుపుదాన
అవినీతి దైవంబు హర్షించడందువా
ఆకుప్రాతలు సాక్ష్యమనను నేను
ప్రత్యర్థులేరైన పరిహసింత్రందువా
ధనమిచ్చి వారల దనుపుదాన
నాసతీ ధర్మంబు నాశమౌనందువా
సంఘ సంస్కారముల్ సరకుసేయ

గీ. నిజము నాప్రేమ నటనమే నీదుప్రేమ
ఒకతె నూరించి పెండ్లాడు టొక్కసతిని

చెప్పెడిది వేరు తలపున చేయుటొకటి
ఏల జడిపింతు మ్రొక్కెద నేలుకొమ్ము.

మో :—రేవతీ ! పొరపడుచున్నావు. భారతీయసతీత్వం నిలుపుకొన నీ బాధ్యత అయిఉంది. నిమిషసౌఖ్యంకోసం మనసును మారు త్రోవ పట్టించడం...

రే :—నేను లేనిజీవితం ఎడారిఅన్నావు. నేనుంటే బ్రతుకంతా బంగారు పంటన్నావ్ ఆనిమిషాలకు బదులు నిరంతర దేవత్వం యిచ్చినా వద్దనే నీమాటలు మరచిపోయావా ? మోహన్ ! నాహృదయమంతా నీదేనని, నా దేహం మలినమైనా నాప్రేమ నిర్మలమనీ నిన్ను కాళ్ళంటి కన్నీళ్ళతో...

మో :—నానిర్మల వాతావరణంలో విషాన్ని పూరించకు. నీమాటలతో నన్ను వెర్రివత్తించి నానీతిధర్మాలకు అంతరాయం కలిగించకు. అయినా...

సీ. విచ్చుకత్తులురెండు వేరుచేయక నొక్క-
ఒఱలోనఁ బెట్టిన నుండగలవె ?
రెండునావలమీద రెండుపాదములూని
పయనమాటది నిరపాయమగునె ?
తాతముత్తాతలనాటి ధర్మంబులవి ఎల్ల
మంటలోగలుపుట మంచిదగునె ?
పశ్యజనామోద పరమపాతివ్రత్య
శీలంబుతప్పుట సేమమగునె ?
గీ. మంచియో చెడ్డయో కాని ఎంచి వృద్ధు
పెండ్లియాడితి వాతనిఁ బ్రేమమీఱ
వలచి వలపించుకొమ్మింక వసుధనతడె
పతియుగతియని మెంచుమో పద్మగంధి !

రే:—ఎప్పుడైనా నా ప్రేమను నిరాకరించగలిగావా మోహన్! వేరు మాటలుచెప్పి నాప్రేమను కోపబుద్ధితో త్రోసిపుచ్చకు. నువ్వేకావలెనను కృతిని అనేక రాగాలతో అంతంలేకుండ ఆలాపిస్తోంది నాహృదయం. ఇప్పటివరకు దుర్భరంగా గడిపాను జీవితాన్ని. ఇహావదలలేను. సృష్టిని సహితం నిలిపే నీసౌందర్యానికి దాసురాలను—

మో:—వ్యభిచారం సంఘానికి వేరుపురుగువంటిది. యుక్తాయుక్త జ్ఞానం నశింపచేసి పాపానికి దారితీస్తుంది. ఆ పాపపుతలంపులను జయించగలిగినప్పుడే నీవు ఆదర్శ భారత పుణ్యస్త్రీవి కావడానికి అవకాశాలు ఏర్పడతాయి.

ఉ. దేహము శాశ్వతమ్మె సుదతీమణి నీమదిలోన తుచ్ఛమౌ
మోహమునాపలేవె క్షణమో మతికొంచెమొ కల్గుసౌఖ్యముల్
దాహమురీతికావె? అలదానికినై కులమున్ యశమ్ము నా
తీ! హతమార్చెదీవిటుల తెంపిరివౌటుచితంబె రేవతీ!

రే:—కోరివచ్చితినని తృణీకరిస్తూ కోపబుద్ధితో నాప్రేమనుత్రోసిపుచ్చడం న్యాయమా? ప్రేమనే అవధిగా—కర్తవ్యంగా—ఆశయంగా పెట్టుకొని నాఅనురాగం వేయివిధాల వెలిబుచ్చాలనే హృదయంతో నీదగ్గరకు వచ్చాను. చూడూ!—పాశాలవలె లాక్కొని వచ్చాయి నా కోర్కెలు. మోహన్! నీసౌందర్యమే నాకాహారము, నీప్రేమే నాప్రాణము. నీప్రేమలేనిది నాకుసమస్తమూ శూన్యం. అర్థవిహీనం.

మో:—ఉష్! తుచ్ఛవాంఛలకు చిక్కి—దాసురాలివై అధమబుద్ధితో—

రే:—జీవితమంతా కన్నీళ్ళతో కడిగి ప్రణయపూజచేసే భక్తురాలను ఏప్రార్థనలవల్ల, ఏస్తోత్రంవల్ల నీహృదయం కరిగించగలనో తెలుసుకోలేక పోతున్నాను.

మ. అనివార్యమ్మగు ప్రేమవాహినుల నీదన్ లేద ఆనాడు! నా
మనమందుంగల కోర్కెదీర్పుమిక నీమంబన్న జీవింతునే!
అనుగుం బెండ్లము కాకపోతినని యన్యాయమ్ముగాంద్రోసిరా
జనగా చెల్లునటోయి నీమనసు రాయా? రప్పయా! మోహనా!

మో:—రేవతీ! నీ శీలాన్ని భంగపరచడం నాకిష్టంలేదు. నీసతీత్వాన్ని మంటగలిపి నీ జీవితవాహినిలో బండరాళ్ళు దొర్లింప నామనస్సు అంగీకరించదు. ఈకోరికలు నీకు పాపానికి దారి చూపి పతితనుచేసి విడుస్తాయి.

రే:—మోహన్!— ఎందుకీ పెడమాటలు! పాపపుణ్యములమాట మొదటనే యోచించాను. నీతో పూర్వంవలె ఆనందాన్ని అనుభవించి అవసరమైతే ఆ నరకానికికూడ పోదామనే నిశ్చయంతో వచ్చాను. ఇదిగో! నా ప్రేమహృదయం నీ పాదములచెంత పడవేస్తున్నాను. కౌగిలించుకో— కాళ్ళతన్నుకో—

మో:—హిందూధర్మాలను పాటించి గౌరవంచూపడం నీధర్మం కాదా?—

రే:—జీవంలేక బ్రతికి చచ్చిన తాటాకుకవిలికట్ట సూత్రాలను ఏకరుపెట్టి నన్ను చిత్రవధకు గురిచేస్తూన్నావు. మనజీవితమంతా తీవ్రమైన ప్రేమతో వెలగాలనే అప్పటి నీమాటలు అప్పుడే మరపునకువచ్చాయా మోహన్!—

మో:—నీమాటలకు నానిశ్చయాలు, మనోనిగ్రహం ఎటువటు చెదరిపోతూన్నాయి. రేవతీ!— నానిర్మల ప్రశాంతజీవిత బాటలో ముళ్ళకంచెలు దిగగొట్టకు. నిర్మల క్షీరకలశంవంటి నా భావిజీవితంలో విషాన్ని చిలికి కళంకపరచకు. వెళ్ళు— నన్ను మరచిపో— నన్ను వశపరచుకొన ప్రయత్నించకు—

రే:— మోహన్ !— కోరివచ్చిన స్త్రీనని చులకనగా చూడకు. స్త్రీహృదయం పరాభవంచేత రోషపూరితం అయితే ఈర్ష్యావేశంతో మహాగ్నిజ్వాలలు రేగుతాయి. యోచించుకో ! స్త్రీ అంటే నీవు తలుస్తూన్నంతటి చెనటిస్వరూపిణి కాదు. పురుషుల చంచలహృదయాలవలె తన ఆత్మగౌరవమును మరచి కనబడినదాని కల్లా చేయిచాచి ప్రణయభిక్షను అర్థింపదు. ఆమె నిజంగా మనఃపూర్తిగా నిండుహృదయంతో ప్రేమించిందంటే ఆమె ప్రేమ కగ్గమైన ఏపురుషుడూ తప్పించుకొనలేడు. రేవతి ప్రేమశక్తిస్వరూపిణి సుమా !—

సీ. నా ప్రేమలోనెంచి నన్ను మన్నింతువా
ప్రేమ వీవనలచే వీచుదాన
కాదు కాదందువా కాలసర్పము రీతి
విషపూత వీవనల్ వీచుదాన
క్రీగంట నన్నేలి కేళీవినోదాల
కేరింతకొడుదువా కేలుమోడ్తు
కాదు కాదందువా గండర గండనై
నీసుఖము చిటికెలో నీరుజేతు
గీ. మోహపాశమ్ము కాల సర్పోహమనుచు
భయద దంష్ట్రల విషమును బరపి నిన్ను
వెంటనంటిన రక్షించు వీరుడేడి
మూడులోకాలు వెతికినన్ మూఢమతివె ?

గాన మోహన్ !— సంఘంచేత తరుమబడుచున్న ఆ క్రొత్తమైత్రి మొహం భార్యకు నీవు భర్తవంటే నేను సహించలేను. ఈ ఒక్క కోరికా చెల్లించి నాపాలిట ప్రణయచక్రవర్తివై ఈ ప్రేమరాజ్యాన్ని హాయిగా ఏలుకో ! నీకు అంగరక్షనై అన్ని సుఖాలు నీకు అందచేస్తూ ప్రేమరాజ్యంలో నీతోకూడ వీరవిహారాన్ని సల్పుతూ....

మా :—ఛీ!...నీవు స్త్రీవి కదూ! ..భారతపుణ్య నారీమణుల వేడిరక్తం నీలో ప్రవహించడంలేదూ !—

తే. గీ. ఎవనినో పెండ్లియాడియు నిపుడు నన్నుఁ
గూడి క్షణకాల సుఖముకై కోంపచెఱుప
దలచుటది భారత స్త్రీకి ధర్మమగునె
కులట లొనరింత్రుబో యిట్టి కుత్సితములు.

రే :—ఆ! కులటనా నేను!— కులటను భార్యగా స్వీకరించి పైగా నన్ను కులటను చేసి మాట్లాడుతున్నావా!—నీవు పరిణయమాడిన మహాపతివ్రతికంటె తీసిపోయినానా నేను! పదిమందిలోనూ పరపతి లేక బజారువెంట తిరిగే కులటయైన నీ క్రొత్తభార్యకంటె అధము రాలినా నేను! చూడు మోహన్! నీవు నన్ను తృణీకరించినా, ప్రేమించాలనే, పూజించాలనే తృష్ణ నాలో బలపడుతోంది. నిన్ను నేను త్రికరణశుద్ధిగా ప్రేమిస్తూ, నాకాంక్షలను నీ కాళ్ళ ముందు పడివేస్తున్నాను—

మో :—హద్దుమీరి మాట్లాడుతున్నావ్! అగ్నిసాక్షిగా నీ యిష్టతతో జరిగిన వివాహాన్ని మరచి నీ భర్తను నీవు మోసము చేయ తలపడుతున్నావ్...

రే :—[కాళ్ళమీదపడి] మోహన్! నిన్ను విడువలేను. నీవే నా హృదయంలో ఆరాధించుకొన బడుతూన్న ప్రియభర్తవు...

మో :—ఛీ!— స్వైరిణి!— కులటా...

ఉ. విద్దెలునేర్చి శాంతియుత వృత్తముదెల్పుచు తోడివారికిన్
బుద్ధులు దిద్దదంచు నిను పోల్చితి నిస్సిరో! మూర్ఖవై యిటుల్
నిద్దపుశీల వాహినిని నింకగజేసితి వెంతదానవే
సుద్దులుభూని పొమ్మిక ననూకయును బెంపక దుష్టచారిణీ.

[అంటూనా ఆమెను త్రోసివుచ్చి విడిపించుకొని నిష్క్రమిస్తాడు]

రే :—[పీడిన తలతో ఆతడు వెళ్లిన ప్రక్కకు కోపంగాచూస్తూ] ఏమన్నావ్ !— నేను కులటనా? మూఢుడా !— నీ ప్రస్తుతభార్యను నీకండ్ల ఎదుటనే కులటనుచేసి విడచువరకు నిద్రపోను జాగ్రత్త! సర్వశక్తులూ ఎదురు తిరిగినా, పరలోకానికి నీవు పరుగెత్త చూచినా నాలోని యీ పరాభవాగ్ని కారుచిచ్చులా నీజీవిత కాలచక్రాన్ని వెన్నంటి కాల్చి ప్రతీకారాన్ని తీర్చుకొనగలుగు తుందని మాత్రం మరచిపోకు. ఏ అంధకారబంధురమైన కొండ గుహాలలో నీవు తలదాచుకొన జూచినా ఫెళఫెళార్భటులతో ప్రళయమారుతమైన నా ప్రేమ కాంక్షలకు నిన్ను ఆహుతి యిస్తాను. ఏకతిక జీర్ణారణ్యంలో కనబడకుండ దాగొనజూచినా 'ధగ ధగ' మెరసే నాపరిభవాగ్ని దేదివ్యకాంతులతో నీకండ్ల ముందు వెదజిమ్మి నీపాలిట పేృమపిశాచినై మృత్యునాట్యాన్ని సలిపి నిన్ను భీభత్సపరుస్తాను. జాగ్రత్త! ఇదిగో- యిప్పుడే కార్య రూపం దాలుస్తూన్నాను. కాచుకో!

10 వ అ ను బం ధం

[ నిష్క్రమిస్తుంది తెరపడుతుంది. ]

---

# 9వ రంగము

[రామశాస్త్రి తనఖాదస్తావేజులను చూస్తుంటాడు. తెరలేస్తుంది]

రా:— నా సంపాదనచూచి అయినా సంతోషించే వ్యక్తికనబడదు. ఏదోకష్టపడి, అయినకాడికి ఆరువేలు గంగలోపోసి దానిని కట్టుకొన్నానన్న మాటేగాని మనసిచ్చి మాట్లాడదే! ఏదో మొగుడనీ, పెళ్ళామనీ చిలుకా గోరింకలులా మాట్లాడుకొంటూ ఏదో లేదనిపించు కొంటూంటే అదో అందం. అబ్బే! అసలు రాతివిగ్రహంలా ఉలకదు— పలకదు. అసలు దాని దృష్టి ఈ ప్రపంచంలో ఉంటుందో ఉండదోకూడ అనుమానమే. దాని ఉద్దేశం కనుగొని కొంచెం ఆర్డరులో పెడతేనేగాని ఆటంక రహితానికి రాదేమోకూడ...

[రేవతి ప్రవేశము]

రే:—[రోషంతో] ఊ!— ఏమైనా అంటారు ఆదరణలేకపోతే...

రా:—[అదరిపడి] ఏమిటాకోపం!— ఏమొచ్చిందేం! — ఆదరణ లేకపోవడ మేమిటి? ఏ దాసీదైనా ఎదిరించిందా? చెప్పు. దాన్ని యిప్పుడే తగ్గించేస్తాను. అంతే దానికి చాలదంటావా!— చూడు. ఏదో నేరంమోపి దానిని పోలీసుల పరంచేస్తాను.

రే:—[పైకిచూస్తూ] ఊ!— నన్ను నలుగురిలో నగుబాటు చేయ సమకట్టింది.

రా:—ఎవరది! ఆపేరు చెప్పవేం? ఊ! చెప్పు—దాని అంతం కను క్కొంటాను. నా పలుకుబడి ఈపరంగా అయినా నీకు ఎరుక పడేలా——

రే:—ఇచ్చట వాసుదేవరావుగారి కోడలట. నన్ను నలుగురిలో ఎగతాళిచేసింది.

రా :—అంటే! మొన్న చనిపోయిన వసుదేవరావు కోడలా? మోహన్ అనే కుర్రగాడిదె పెళ్ళాం అనుకొంటాను, ఏం! అంత పొగరుమోత్తనమా! రామశాస్త్రిగారి భార్యావన్న సంగతి దానికి తెలియదు కాబోలు.

రే :—తెలియకేం! తెలిసే ఎగతాళి చేయడం.

రా :—ఏమం దేం! అంతగర్వమటే దానికి. అసలు ఏమంది నిన్ను?

రే :—ఏమంటుంది! ముసలాయన పెళ్ళాం ఇదేనా? ముసలి మొగుడుకోసం ఈ పోకులంతా ఎందుకు—అని ఏమేమో అంది విడువకుండ. దానితో అక్కడివారు అందరూ నా మొహంచూచి ముసిముసి నవ్వులు నవ్వారు.

రా :—ఊ!...రామశాస్త్రిగారి తడాఖాయింకా దానివరకు ప్రాకి యుండలేదనుకొంటాను. ఇదేకదూ లేచివచ్చిన స్త్రీకి పుట్టిన క్రొత్తపెండ్లి కూతురు?

రే :—ఊ...అదే. అయితేనేం! తన భర్త చదువుకొన్న యౌవన పురుషుడు కదాఅని ఇతరులను హేళనచేయడం.

రా :—ఐతే ఈ దినమే ఆతనిని వెలివేయించాలని అగ్రహారం పెద్ద సోమయాజులుగారికి కబురుచేస్తాను. దానితో మన సంగతి ఆ గర్విష్టి ముండకు తెలిసి—

రే :—అంత మాత్రంలో నా కోపం చల్లారదు. వారికి ఆజన్మాంతరం మరువని శిక్షను విధించి విడువాలి.

రా :—ఊ... యోచించు! నీవేచెప్పు ఆ శిక్ష ఏమిటో! దానికి తగ్గతాళం నే వేయించి కథ నడిపిస్తానుగా!

రే :—వాళ్లు నాకడ్డఎదుట దిక్కులేని ఫకీరులు కావాలి. అప్పటికి గాని నా హృదయంలో లేచే అగ్ని నెరసులు చల్లారవు.

రా :—దాని విధానం! అది ఏలా సాధ్యమౌతుంది! అసలు వాళ్లు మనదగ్గరకు అప్పుడైనా వస్తే ఆతరువాత మనఎత్తులు కనపరచి ..

రే :—నేనూ యోచించి చెపుతాను. మీరుకూడ యోచించి తగిన మార్గం వెతికేవరకు నాలో పరాభవాగ్ని చల్లారదు. ఆమె మాటలు నాకు బల్లెపుపోటులులా గుచ్చుకొని ఇప్పటి వరకు బాధిస్తూనే ఉన్నాయి.

రా :—ఎంతమదం దానికి! నన్ను ముసలివాడంటుందా? నాపాటి దేహదారుఢ్యం ఉందా ఇప్పటి దాని భర్తకి! సరే - సమయం చిక్కనియ్యి!

[లోపలనుంచి] కేశవరావుగారు తమని ఓమారుదస్కత్తులు చేయ డానికి ఆఫీసుగదిలోనికి రమ్మంటున్నారండి.

రా :—ఇదిగో - వస్తూన్నా!

రే :—మీరు వెళ్ళడం ఎందుకు ఆయన్నే రమ్మనండి. వాసుదేవ రావుగారి కుటుంబ రహస్యాలుంటే తెలుసుకోవచ్చును కూడ ఆయనద్వారా.

రా :—అవును—[లోపలకుచూచి] కేశవరావుగార్నే ఓపర్యాయం ఇక్కడికి రమ్మను.

[లోపలనుంచి] చిత్తం

రా :—[అనుమానంగా] అయితే నీవులోనికివెళ్ళు. నేను అన్ని విషయములు కనుక్కొని కథనడుపుతాను.

[కేశవరావు ప్రవేశము. రామశాస్త్రి రేవతి కనబడకుండా అడ్డుగా నిలుస్తాడు.]

కే :—[శంకిస్తూ] నన్ను ... రమన్నారట కదండి లోపలకు.

రా :—[వారియిద్దరి ముఖాలు కని పెడుతూ] ఆ! రమ్మన్నాను. అలా దూరంగా నిలబడు. వాసుదేవరావుగారి కుటుంబం సంగతి పూర్తిగా నీకు తెలుసుకదూ!

కే :—[దొంగతనంగా ఆమెను చూస్తూ] చిత్తం.

రా :—ఏమిటిచిత్తం! రొంపిలోదిగబడ్డ గంగిరెద్దులా కండ్లచూపు—తలఊపుతప్పితే నోటమాట రాదేమోయ్ !—

కే :—[ఆమె వంక రహస్యంగా చూస్తూ] చిత్తం—

రా :—నీ చిత్తం తగలయ్యా !— సమాధానం ?

కే :—ఆ ! ..నాకుపూర్తిగా తెలుసు. వారి అవసరం ఏమొచ్చింది! ఏమైనా అప్పును కోరినారావారు !

రా :—[రేవతి వంకచూచి] నువ్వుపద. నేను కనుక్కుంటానుగా ! ఊ ! — నడాలి ..

[రేవతి విసుగుతో లోనికి పోతుంది.]

రా :—ఇదిగో పంతులూ ! ఆ వాసుదేవరావుగారి కోడలట. మావాళ్ళను ఏమందో విన్నావా ?— ఏముంటే ఏమిలే ! అసలు మావాళ్ళనుచూస్తే కళ్ళుకుట్టుకొంటారు. పొరుగువారితో నైనా మాట్లాడదని వారికి కడుపుదురద. అది తలదువ్వుకొని పోగ్గా నిలబడిందంటే చూడలేని తనంతో ఏవో అంటారు.

కే :—చిత్తం ..నిజమేనండి ఆరోగ్యజ్యోతి వెలుగుతూన్న ఆమె నవ్వు మొహం సామాన్య స్త్రీలనుకూడ అతిసులభంగా ఆకర్షించి తీరుతుందనడంలో సందేహం లేదండి.

రా :—అందుకేనోయ్ ! అది అంటే ఆత్మప్రేమ. అది ఎంత చెపుతే అంతేనాకు. నేనుఅంటే పడి చచ్చిపోతుందోయ్ !

కే :—ఆప్రేమంతా ఎక్కడనేర్చుకుందో ఆమె ! అదిగాక మీగడ తరకల్లాంటి తమ మృదుసంభాషణకు ఆమెలో ప్రేమ అలాలేచి వచ్చి మిమ్మల్ని యిట్టేయిలాచుట్టేస్తూంది.

రా :—ఇంతకాలమైంది. అసలు యింతవరకు వీధివెనుక రోడ్డునైన పూర్తిగా చూచిందంటే నాకు నమ్మకంలేదు. ప్రతి పురుషవ్యక్తిని సోదరునిలా చూచుకొంటుందంటే నమ్మ.

కే :—మిమ్మల్ని తప్పు అనండి.

రా :—అదేనోయ్! అన్నమాటే. ఏమంటావ్! నువ్వ కనిపెడుతూనే వున్నావుగా!

కే :—అమ్మమ్మ ఎంతమాట! ప్రేమోపాసకులపాలిట పొటాషియమ్ సైనెడ్ కదండి ఆమె!

రా :—అంటే ?

కే :—అదేనండి. విషకన్య అన్నమాట.

రా :—అసలువిషయం చెప్పడం మరచాను. ఆ కుర్రాడిభార్య మా ఆవిడ్ని అనరాని మాటలు అందటోయ్!

కే :—ఊ! ఆపళంగా ఊరుకున్నారామీారు ?

రా :—ఊరుకున్నానా నేను? చెబుతున్నానుగా ఇప్పుడు నీతో.

కే :—ఏమంది! పిట్టకి కూతపట్టినట్టుంది.

రా :—ఏమంటే ఏమిలే. నీవు ఒక్కటి యోచించి నీశక్తి నాకు కనపర్చాలి.

కే :—చిత్తం. ఎప్పుడు కాదన్నాను మీాకోరికల్ని. ఏమిచెయ్యాలో చెప్పండి. వీలుగావుంటే యిప్పుడే చేసుకొస్తాను.

రా :—ఇప్పుడు చేయవలసిన పనికాదది. ఆ మోహన్ గాడ్ని దానితో సహా ఫకీరునుచేసి వదలాలి. ఏదైనా మార్గం ఉంటుందంటావా?

కే :—అదికష్టమే. అతడు డబ్బున్నవాడు. అతనిని సామాన్యవ్యక్తిని ఎదిరించినట్లు ఎదిరించి నిలువడం కష్టమే.

రా :—సగం ఆస్తి ధర్మకార్యాలకి వ్రాసివేశారుగా అతని తండ్రి. ఇహ నేముందిలే!

కే :—యోచించి చెపుతానండి. అతని ప్రస్తుత పరిస్థితులు పూర్తిగా అర్థంచేసుకుంటేనేగాని ఏమిచేయాలో నిర్ణయించలేము. కనుక్కొని...

రా :—ఇటువంటివాళ్లను అనేకమందిని తలచుకోవడమే తడవుగా అరనిమిషంలో మాపేసివదిలేసాను. వీడిలెక్క ఏమిటోయ్! నువ్వు ఏదో తెలిసున్నవాడివికదా అని సలహా అడిగాను. ఇంతేనా నీశక్తి! ఉత్తకబుర్లుతప్ప టయిమువస్తే ఉళక్కే!

కే :—కొంచెం యోజించడానికి వ్యవధియిస్తే...

రా :—ఊ! సరే. వానిసంగతులు కనుక్కొని నాచెవిలో వెయ్యి. తరువాతచూద్దాం తక్కిన విషయాలు.

కే :—చిత్తం. ఇక వెళ్ళవచ్చుకదండీ!

రా :—ఊ! శీఘ్రుంగా వెళ్ళు. స్నానంచేసి నేనూ జపంలో కూర్చోవాలి.

[ రామశాస్త్రి కేశవరావులు నిష్క్రమింతురు, వెంటనే ప్రక్కనున్న రేవతి ప్రవేశం. ]

రే :—ఇప్పుడీ కేశవరావునే మోసంచేసి నాచేయబోవు పనులకు కీలుబొమ్మగా నిలిపి యీతనివల్లనే నాప్రతిన నెరవేర్చుకోవాలి. అప్పుడుగాని నాలో రగుల్కొంటూన్న మంట చల్లారదు. ఈతనికి ఆశచూపి చాకచక్యంతో పనులు చేయించుకోవాలి. ఇంతకంటె ఇప్పట్లో వేరుమార్గం కనబడదు. [కొంచెం యోచించి] ఊ! శాస్త్రిగారు జపంలో కూర్చున్నారు. ఈతనితో మాట్లాడానికి యిదే యదను. [ లోపలకు తొంగిచూచి ప్రకాశంగా ] కేశవరావుగారూ! కేశవరావుగారూ!

కే :—[ లోపలనుంచి ] ఎవరువారు ?

రే :—ఉష్ ! నేనూ !- రేవతిని. బిగ్గరగా మాట్లాడకండి.

[ కేశవరావు ప్రవేశము ]

కే :—మీరా నన్ను పిలిచింది! ఎందుకో తెలుసుకోవచ్చునా ?

రే :—ఆ! ఒకరహస్యం మీతో చెప్పడానికే పిలిచాను.

కే :—[ సంశయముతో ] నాతోరహస్యమా! రామశాస్త్రిగారు ఇంటిలో లేరుగదా ?

రే :—జపంలో ఉన్నారులెండి. మీతో మాట్లాడలని చాలారోజు లున్నంచి అవకాశం కోసం ఎదురుచూస్తూ, ఇప్పుడు సమయం చిక్కడంచేత సిగ్గువిడచి నేనే మిమ్మల్ని పిలిచాను.

కే :—ఈసంగతి ముందే తెలిస్తే నేనే స్వయంగా మాట్లాడిఉందునే! మీరంటే—నాకూఉంది. కాని ఏమంటారో అన్న భయంతో గుట కలు మ్రింగుతూ — ఊరుకొన్నాను—

రే :—ఇప్పుడుకలిసేంగా! ఒక్కసహాయం మీవల్ల జగగాలి. ఆ తరు వాత మిమ్మల్ని ధనరాసిమీద కూర్చుండబెట్టి...

కే :—నాకుమాత్రం తెలియదూ! యీ ముసలాడు యిక ఏన్నాళ్లు బ్రతుకుతాడులే. అప్పటినుంచి ఇక సర్వాఆస్తీ మీ చేతుల్లో యిమిడిపోతుంది. [జ్ఞాపకం వచ్చినట్టు నటిస్తూ] ఆ! మిమ్మల్ని ఎవరో ఏదో అన్నారని రోషంతో కంట నీరుపెట్టి ఆయనప్రక్క కూర్చున్నప్పుడు మీ కళ్ళలోని అశ్రుబిందువులకు నా కాళీ హృదయం దెబ్బతిన్న పక్షిలా గిలగిలకొట్టుకుంది అంటే నమ్మండి. పెనంలోవడేసినట్టు వేగిపోయింది నా గుండె. చెప్పకపోవడం ఏం! అప్పుడుకూడ మీ ముఖంలో క్రొత్తఅందం కనబడి నా గుండె నన్ను కరిగారుపరచింది. వానపోయి ఎండకాసిన సాయంత్రంలెంత

అందంగా ఉంటాయో రోషంతో ఏడ్చి నవ్విన స్త్రీల ముఖాలు అంత...

రే :—[నవ్వుతో] నాలో అందం మీకు కనబడుతోందన్నమాట!

కే :—ఏం!..ఆ ఎవర రాముశాస్త్రికి మీ అందం అగుపడకపోతే నాకూ అంతే నంటారా? కమ్మకొని వికసించిన పుష్పంలాఉన్న మీ తెల్లని ముఖం...

రే :—రావుగారూ! ఆమె నన్ను పరాభవించిన వేదన నన్ను కుమిలించేస్తూ ప్రతీకారంకోసం నా మనస్సు పరుగులెడుతోంది.

కే :—అవును. మీ వేదన నిప్పు బొగ్గువలె నా హృదయానికి చురుక్కుమన్న బాధ అప్పుడే కలిగించింది.

రే :—ఆవిషయంలో మీరుశ్రద్ధ తీసుకొని త్వరలోనే వారిని దరిద్రులుగాచేసి ఆమెను ఆ మోహన్ కండ్ల ఎదుటనే కులటనుచేసి ప్రత్యక్షంగా వదలాలి.

కే :—ఓ! ఈసారి నిమిషంలో ఆపని జరిగేటట్టు స్పెషల్ యింటరెస్టు తీసుకొని నేనే తీవ్రప్రయత్నంలో ఉంటాను.

రే :—ప్రయత్నించండి. అవసరమైతే కావలసినడబ్బు శాస్త్రిగారి వద్ద కాచేసి మీకిస్తూంటాను.

కే :—[యోచనతో] ఓపనిచేస్తే మనచేతిలో సులువుగాచిక్కుతాడు.

రే :—ఏమిటది!

కే :—ఆతను విశాఖపట్నంలోనే మకాంచేసి వర్తకంచేయ కుతూహల పడుతూన్నాడు. నిన్ననే కొన్ని కన్సైన్మెంట్సుకు ఆర్డరు యిచ్చేడు. మనంకూడ ఆర్డరుచేసి ఆతని ధరలకు పోటీగా సరుకు పారేసేమా అంటే ఒక్కసారికాళ్ళుచాచి పూరుకుంటాడు.

రే :—చక్కని ఉపాయం. ఊ...కానివ్వండి!

కే :—మన శాస్త్రి ఒప్పుకుంటాడా ?

రే :—నేను ఒప్పిస్తాగా! డబ్బుకోసం యోచించకండి. యీ దినమే కన్‌సైన్‌మెంట్సుకోసం శాస్త్రిగారి చేతనే ఆర్డరు చేయిస్తాను. ఏదో విధంగా వారు ఫకీరులు కావడమే నాముఖ్య ఆశయం. తరువాత నిమిషంలో దానిని కులటనుచేయడానికి తగిన అవకాశాలు సులువుగా ఏర్పడతాయి.

కే :—ఊఁ!...కానివ్వండి. మీకు బలేపట్టుదలండి! [సిగ్గుపడుతూ] మరి...మనం,...ఎప్పుడు...

రే :—తొందరపడకండి. నా ప్రతిన నెరవేరువరకు నాకా మధుర తలపులవైపు దృష్టి మరలడంలేదు. నేను చెప్పినట్లుగా చతురతతో అతనిని ఫకీరునుచేసి ఆమెను నాపరంచేసేరంటే అప్పుడు నేను మీ దాననన్న మాటేగా!

కే :—వొళ్లు ఝల్లుమంటోంది. నిండ పూసిన చెట్టును ఊపితే రాలిపడిన పూలులా నాభావాలన్నీ రాలిపడుతూన్నాయి.

రే :—[సిగ్గునునటిస్తూ] తొందర పడుతూన్నారు—

కే :—[సంతోషంతో] మనస్సులో బిగ్గరగానైనా యోచించుకోలేని అవకాశం చిక్కినందుకు నా నాళాల్లోని వేడినెత్తురు ముందుకు లాగుతూ హృదయం ఒక్క గంతులో మీకోసం వెతుకులాడుతోంది. మీ ముసలి భర్తనుచూస్తే అసలు నాకే అసహ్యమేస్తోంది. మీరు అతనితో ఎలా కాలాన్ని దొర్లిస్తున్నారా అన్న నిగూఢసమస్య నన్ను సర్వదా విడువకుండ బాధిస్తూనే ఉంటుంది.

రే :—ఏదో పేరుకుమాత్రమే భర్త. మీకు తెలియనిది ఏముంది! అందుచేతనేగా మీతో...

కే :—ఆ ! ఎన్నిదోషాలైనా, క్రౌర్యాలైనా కడగివేసే తారక మంత్రం 'భర్త' అనే పవిత్రపదం. నాకు తెలియకేం! ఆశబంధంతో పాపాలు అన్నీతలలు వొంచి తప్పుకోన వలసిందే!— పేరుకి భర్త అనేవాడు ఉండాలిలెండి—

రే :—అందుకేగా ! [ప్రేమను సూచించేసిగ్గును నటిస్తూ] అసలు... మీతో...పరిచయం కలుగచేసుకోడానికి ఎంతెంతటి విశ్వ ప్రయత్నాలు చేసేనో !

కే :—అరెరే !...అసలు నాకావిషయం తెలియందే! లేకుంటే అప్పుడే హార్డిల్సురేస్‌లా చెట్లు—గోడలు దాటి మీ ముందు వాలిపోనూ !

రే :—అదిగో శాస్త్రికి పూజకావచ్చింది. ఇహ మీరు వెళ్లండి. శాస్త్రిగారు తోటలోనికి వెళ్లినప్పుడు రహస్య విషయములుంటే ప్రసంగించడానికి లోనికి రండి. ఫరవాలేదు.

కే :—ఆపాటి ఆర్డరుంటే అసలు అయినవాడ్నయినా లెక్కించను. అలానే వస్తూంటాను. ఆ మోహన్‌గాడి వ్యాపారం సంగతి యిప్పుడే కనుక్కొని, ఏటమ్ బాంబులా వర్కుచేసి మీకు సరండర్ అనిపించేస్తాను.

రే :—త్వరగా ప్రయత్నంలో ఉండండి. అప్పుడు మన యిద్దరి కోర్కెలు ఫలిస్తాయి.

కే :—[సంశయంగా] కాని...

రే :—ఏమిటా సంశయం !

కే :—నన్ను — నన్ను — ప్రేమిస్తున్నట్టే కదూ !

రే :—రావుగారూ !—నా కాభర్తతో సౌఖ్యం ఉంటుందనే ఊహిస్తూన్నారా ? మీ వంక తిరిగిన నా ప్రేమను ఎవరు ఆపగలరు ?

కే :—నాకు తెలుసు. స్త్రీ హృదయం కదలనే కదలదు. కదిలిందా అది జగన్నాధుని రధమే!—చూడండి!—వానను భూమిమీద పడకుండ ఆపడం ఎంత సులభమో స్త్రీ హృదయంలోనుంచి ప్రేమను ఆపడం కూడ అంత సులభం. అదిగో శాస్త్రి వస్తూన్న చప్పుడు అవుతూంది. వెడతా!...

రే :—ఊఁ... వెళ్లండి వేగంగా! [కేశవరావు నిష్క్రమించును] ఈ రావు నా చేతిలో కీలుబొమ్మ య్యాడు. యీ యంత్ర సహాయంతో నాపని పూర్తిగా కొనసాగించు కొంటాను. [మోహనుని ఉద్దేశించి]

సీ. కాంతచేయగలేని కతలున్నవే ధర
పతిప్రాణములు కొనె పడతికైక
అతివ బుద్ధికిరాని దావంతయున్నదే
పుత్రుని చంపె చిత్రాంగిదేవి
కలికి తలనులేని తలపు లెందున్నవే
దేవయాని యదువు దీను జేసె
పడతినై పుణ్య సంపదకు నడ్డున్నదే
నవ్వుల ప్రాణాలు నమలివైచు
గీ. గాన మోహన! కఠినతనూని నన్ను
ద్రోసిపుచ్చిన ప్రాణాల యూళమాను
కాళరాత్రి కరాన కంకణంబు
దీయబూసిన గతియేదొ తెలసికొమ్ము.

[నిష్క్రమించును]

(తెరపడును.)

---

ఓమ్

# రేవతి

## పంచమాంకము

## 10వ రంగము

[లీల సోఫాలో కూర్చుంటుంది. తెరలేస్తుంది]

లీల :—

మ. జననీకామ సుఖాది వాంఛవలనన్ జన్మంబు నీచంబుగా
గననయ్యెంగదయంచు యేడ్చెదను; దుఃఖాక్రాంతమాజీవనో
కను సంఘుమ్మను యగ్నికీలముల దగ్ధంబింత గాకుండగా
నను రక్షించెడి మోహనున్ సతముకృష్ణా వేడెదన్ బ్రోవవే!

[మోహనుని ప్రవేశం. విస్పృహతో మోహన్ కోటును కుర్చీపైవిసరి సోఫాలోకూర్చుంటాడు]

లీ :—కాఫీ తీసుకొంటారా?

మో :—వద్దు లీల! ఒక నిమిషం మాట్లాడించక. యీలానేకొంచం సేపు విశ్రాంతి తీసుకోనియ్యి.

లీ :—మీకు మనశ్శాంతి లేనట్టుంది.

మో :—లీలా! నా దురదృష్టాన్ని తలచుకుంటే నాకే ఆశ్చర్యంగా ఉంది. రెండుమార్లుకూడ కన్సైన్‌మెంట్సు బుక్కుచెయ్యడంలో దెబ్బతిన్నాను. నాది పోయినది సరేకదా అప్పుతెచ్చినదికూడా పోయినట్టే. యిహ ఏలా వారి అప్పులను తీర్చడం!

లీ :—[ఆశ్చర్యంగా] ఆ! మరల నష్టమా?

మో :—అవును. ఎవరో కిట్టనివారు యీ ద్రోహాన్ని తలపెట్టి ఉంటారు. లేకుంటే దెబ్బతినవలసిన అగత్యత కనబడదు.

[యోచించి] నాకీ ప్రపంచంలో విరోధులుకూడ కనబడరే! అది మన అదృష్టంమీద ఆధారపడి వుంటుంది. ఏమనుకుంటే ఏమిలాభం !

లీ :—జరిగిన దానికి విచారంతో శరీర ఆరోగ్యం పాడుచేసు కోవడం తప్ప, పోయినది తిరిగి రాదుగదా! పొయ్యేది అడ్డు పెట్టినా ఆగదు.

మో :—భరింపరాని నష్టంవస్తే యేగుండె శాంతిగా ఉంటుంది! పైగా యీ సంగతి తెలుస్తే అప్పులువారి ఒత్తిడికూడ ఎక్కు వవుతుంది.

లీ :—ఏదో సమాధానం చెప్పుకొని నెమ్మదిమీద తీర్చుకుందాం.

మో :—[పరధ్యానంగా యోచిస్తూ] లీలా ! యీ పరిస్థితుల్లో బుద్ధి కూడ మందగిస్తోంది. మొన్న ఒకాయన కనబడి హితబోధ చేసేడు. నాకు చాల నవ్వు వచ్చింది.

లీ :—ఎవరాయన ? ఏమని హితబోధ చెయ్యడం ?

మో :—[చిన్న నవ్వుతో] గౌరవనీయులు దొంగతనంచేస్తే పయికి రాదని, ఆలా చేయడానికి అవకాశాలు చూపుతాడట

లీ :—అమ్మయ్యో ! దొంగతనమే ! మీరే ?

మో :—[నవ్వుతూ] ఏం లీలా ! ఎందుకాభయం! చేస్తే ఏం !

లీ :—అట్టిభయంకర చర్యలవైపు మీదృష్టి మరల్చకండి. మీరే అలా చరిస్తేనాగుండె పగిలి...

మో :—[తలనిమురుతూ] లీలా !...

లీ :—వద్దు, అట్టిమాటలు అసలువినడం అంటేనే భయంగాఉంది. ఆ మాటలు మర్చిపొండి. దరిద్ర దేవత ఏపనిఅయినా చేయిస్తుంది. అంతకంటే ముష్టిఎత్తుకొని బ్రతకడం మేలంటాను.

మో :—[చిరునవ్వుతో] ముష్టా! యింత బ్రతుకుబ్రతికి ముష్టికి బయలు దేరడమా ?

ఉ. పుట్టితి భాగ్యవంతునకు పుత్రుడనై యికవిద్యలందు వీ
డెట్టును మేటినాఁబరిగి మించితినాసరివారలోన చే
పట్టితినిన్నుపత్నిగ నపాంపతిపుత్రికవోలె దైవమే
పెట్టగలాఁడుపొట్టకయి భీతిలిబిచ్చమునెత్త బోదునే!

లీ :— మీరు...

మో :—చోరుడు ప్రపంచంలో ఎవ్వరుకాదు! ఏవో మారుపేరులతో అందరూ చోరులే. ఒకరిసొమ్ము మరి యొకరు ఏదోలా కండ్లుకప్పి గుంజుకోవడం చోరత్వం కదూ! అయినా ఆతడు చెప్పిన సలహాను మాత్రమే నీకు చెబుతూ వున్నాను. నేను అట్టిపనులు చేయ సాహసిస్తాననే యోచిస్తూన్నావా, లీలా ?

లీ :—లేదు. మీ హృదయం నాకు పూర్తిగా తెలుసు. దయచేసి అసలు అట్టి అవినీతిమాటలు చెప్పు స్నేహితుల సమీపానికే వెళ్లవద్దని నా ప్రార్థన.

మో :—[నవ్వుతో] పిచ్చిపిల్లవు. లీలా! ఎంత ఐశ్వర్యం పోయినా నీవు నాప్రక్క చుక్కానివలె కనబడుతూఉంటే సర్వకష్టాల్ని మరువగలను.

11 వ అనుబంధము.

[ఒక నిమిషమాగి] నేను ఆ కేశవరావు అనే ఆయన ద్వారానే గోపీనాథ్ అనే శేట్ దగ్గర కొంత అప్పు తీసుకొనదలిచాను. ఈసారితో మన అదృష్టం తిరగవచ్చు.

లీ :—చల్లనిమాట చెప్పారు. కాని మరల ఆ స్నేహితుని దగ్గరకే మీరు...

మో :—ఫరవాలేదు లీలా ! భయపడకు. నామీఁవగల నీకా ప్రేమే నిన్ను ఆలా వ్యాకుల పరుస్తోంది.

లీ :—కాఫీని తీసుకోరూ ?

మో :—నీవుకూడ తీసుకో [అంటూ ఆమెకు కూడ టీ కప్పు నందిస్తాడు. ఇద్దరూ త్రాగుతుంటారు.]

[కేశవరావు ప్రవేశం]

మో :—ఓ ! పంతులుగారు దయచేశారు. ఇలా కూర్చోండి.

కే :—క్షమించాడి ..పిలువకుండానే లోనికి వచ్చినందుకు.

మో :—ఫరవాలేదులెండి. కూర్చోండి. ఇదిగో లీలా !— కేశవరావు గారికి కాఫీని తీసుకొనిరా [లీల లోనికి వెళుతుంది]

కే :—అహాఁ ! వద్దండి ఇప్పుడే అయింది.

మో :—ఫరవాలేదు లెండి. కంపెనీకోసం అయినా పుచ్చుకోవాలి.

కే :—ఈ అమ్మాయి కదండి మీ భార్య ?

మో :—అవునండి.

కే :—ఓహో ! ఆమె ముఖంలో భారతనారీమణి కుండవలసిన శుభలక్షణాలు తీక్షణంగా కనబడుతున్నాయి. చూస్తూంటే నమస్కరించ బుద్ధి అవుతోంది. గృహలక్ష్మిఅంటే...

మో :—ఈమె నా ప్రక్కనే లేకుంటె యీ నష్టంలో ఎంత అటమ టించి పోయుందునో మీరే గ్రహించండి. మాలీల ప్రతి మాటలోనూ సహజమైన స్థయిర్యం— నిర్లక్ష్యం కనబడి నాకు లేని ధైర్యాన్ని చేకూరుస్తూంది.

కే :—మీకా భయం అక్కరలేదు. పడిన గోడలు పడినట్లుగనే ఉండవుకదండి !—ఒకరిద్దరిని చంపుతేనేగాని డాక్టరులో పెరఫెక్షన్

రానట్టే, ఒకటిరెండు దెబ్బలు తింటానేగాని బిజినెస్‌లో సీక్రేటు తెలియదుగా !

మో :—ఇప్పుడు నాకా గోపీనాథ్ అప్పును యిస్తాడంటారా ?— యిప్పట్లో...

కే :—అన్నిటికి నేను ఉన్నానుగా! అన్నీ రైటుచేసి ఉంచాను. మీాకు మనస్సు బాగుండలేనట్లుంది. ఒక్కసారి రిఫ్రెష్‌మెంటు రూము మీాదుగా అలా గోపీనాథ్‌గారి యింటికి వెళ్ళి వ్యవహారం సెటలు చేసుకొందాం.

[లీల కాఫీని తెచ్చి అతని ముందు ఉంచుతుంది. కేశవుడు కాఫీని త్రాగుతాడు]

కే :—[కాఫీని త్రాగుతూ] అమృతహస్తమనే చెప్పాలి. ఎం చక్కగా చేశావు తల్లీ! యీా కాఫీని. ఓహో ! అలసిన ప్రాణం లేచి వస్తూనట్లవుతూంది.

లీ :—[తలవంచు కుంటుంది]

మో :—లీలా !— ఈయనే మనకు సహాయం చేస్తానన్న మహా నీయులు. వీరీ పట్నంలో అతిసులువుగా పలుకుబడిని సంపా దించారు. నన్నూ, నా కుటుంబమునూ బాగుగా తెలిసినవారు. వీరు మా గ్రామవాసులే.

లీ :—[కేశవునివంక అడకువతో చూచి] నమస్కారమండి.

కే :—సుమంగళీభవ ! నీ అదృష్టమే యీా మోహనుడికి కవచమై కాపాడుతుంది. భయపడకండి. యీాసారి కన్‌సైన్‌మెంట్సులో లాభం రాకమానదు.

లీ :—చిత్తం. మీా దయతో పాటు ఆ దైవకటాక్షం కూడా ఉంటే—

కే :—ఉంటుంది. భయపడకండి. ఇదిగో— మోహన్ !—లే, మరి. టయిము కావచ్చింది. అలా గోపీనాద్‌గారి యింటికికూడ వెళ్ళి వ్యవహారం రైటు చేసుకొందాం.

మో :—పదండి. లీలా !— ఆకోటు యీలా తీసుకొనిరా.

(లీల కోటు తెస్తుంది. రావు మోహనులు నిష్క్రమిస్తారు)

లీ :—కలినత ఎరుగని నా భర్త కష్టాలకు గురి అవుతున్నారు. ఆతని వ్యాకులతకు నా దురదృష్టమే కారణ మనాలి. సంఘంతో నిమిత్తం లేకుండా నన్ను కాపాడి రక్షించిన త్యాగమూర్తిని కష్టాలనుంచి తప్పించమని ఆదైవాన్ని ప్రార్థిస్తూన్నాను. నాకు ఎంత కష్టము వచ్చినా సంతసంతో సహించగలను. కాని వారికి— ఆ మెత్తని హృదయానికి క్షోభకలుగు తేచూచి సహించలేను. ఓదైవమా!— నా భర్తను యీమారు అయినా కాపాడి రక్షించవూ !— వారి కష్టాలను కడతేర్చి నాకు హృదయశాంతిని చేకూర్చవూ !— యీ ఆపదనుంచి రక్షించవు తండ్రీ!— నీపాద పూజతో నిత్యారాధనలు సల్పుతాను... [12 వ అనుబంధం.]

[తెర పడుతుంది]

---

# 11 వ రంగము

[రేవతి అద్దంముందు తలదువ్వుకొంటూఉంటుంది. కేశవరావు ఆతృతగా ప్రవేశం]

కే :—రేవతీ ! చిక్కింది గువ్వ !

రే :—లీలను చేచిక్కించుకొన్నావా ?

కే :—ఆ ! ఇక్కడకే తీసుకొని వచ్చాను. పయిందుగదిలో నిలువ బెట్టి వచ్చాను.

రే :—వెళ్ళిపోతుందేమో !

కే :—ఊహూం ! ఆమె చూడకుండ మొదటి ద్వారంగడియ వేసే వచ్చాను.

రే :— భేష్ ! తెలివిగా ప్రవర్తించారు.

కే :— మోహనుడు ఎక్కడ ?

రే :— పైగదిలో ఇంకా త్రాగుడుమైకంలోనే ఉన్నాడు. [ఆగి] నీవు త్రాగుడు పరిస్థితిలో మోహన్ ఏలాదొరికాడు ?

కే :— అసలు త్రాగుడుకు ఒకవిధంగా ఒప్పుకొన్నాడా ! ఆతనిని రిఫ్రెష్ మెంటు రూముకు తీసుకొనిపోయి విచారం మరవడానికి మంచి మందని బలవంతపరచి వప్పించడం బ్రహ్మప్రయత్నమైంది. నా సహాయానికి ఆశించిన ఆతడు చేయునదిలేక కష్టంమీద పుచ్చుకొన్నాడు. దానిలో మత్తు కలిపించి త్రాగించడంచేత వళ్ళు తెలియని పరిస్థితిలో మనకు చిక్కాడు. ఇహవాడికి స్పృహవస్తుంది. జాగ్రత్తగా వాడిని బంధించాలి.

రే :— బంధింపబడే ఉన్నాడు. [ఆశ్చర్యంగా] లీలను అంత సులువుగా ఏలా తీసుకొని రాగలిగేరు ?

కే :— ఆమె భర్త కారుక్రిందపడి ప్రమాదస్థితిలో యున్నాడను మిషమీద తొందరచేసి తీసుకొని వచ్చాను. ఎంత అందంగా ఉంటుంది ! అంచేతనే వాడు దానిని ఓ నిమిషం వదలడు.

రే :— [నిట్టూర్పుతో తనలో] ఇప్పుడుగదా నా ప్రతీకారం నెరవేరు నిమిషం వచ్చింది. కులట ఎవరో అర్థం మోహనునికి యిప్పుడు తెలుస్తుంది. [ప్రకాశంగా] మీరు— ఆమెను ఈగదిలోనికి తీసుకొనివచ్చి ఆమెను మీచేతులలో యిరుకించుకొని—

కే :— నాకు తొందరగనే ఉంది. నీవు తొందరగా తప్పుకొంటే తరువాత విషయాలు నేను చూచుకొంటాను. [జ్ఞప్తికివచ్చి నట్లుగా నటిస్తూ] మరిఒక విషయం, శాస్త్రిగారు యింట్లో లేరుకదా !

రే :—ఉన్నా యిక్కడకురారు. వారు రాకుండ అన్ని యేర్పాట్లు నేను చేయిస్తానుగా. అదిగో! ఆబల్లమీద బ్రాందిసీసా.

కే :—రైట్! బాగుంది. ఊఁ- నువ్వునడు.

[రేవతి నిష్క్రమిస్తుంది. కేశవరావు బ్రాందిని త్రాగి లీలను వెంటబెట్టుకొని వస్తాడు]

లీ :—[ఆతృతతో] ఏమండీ! వారిని చూపుతానన్నారుగా! ఎందుకీ ఆలస్యం! ఎక్కడ పరుండబెట్టారు ఆయన్ని?

కే :—ఆయనకేకదూ! ఆప్రక్కగదిలో పరుండబెట్టించానులే! [నవ్వుతాడు]

లీ :—మీమాటలూ చేష్టలూ చూస్తే నాకు ఏదోలా భీతిని కలిగిస్తూన్నాయి.

కే :—నేను నీ ప్రక్కనుండగా భయమెందుకు? రా! దెబ్బలుతిని ఆ ప్రక్కగదిలోనే ఉన్నాడులే—

లీ :—పదండి వేగం. చూపండి — నా హృదయం పగిలిపోతోంది.

కే :—ఏం! పోషించలేని ఆ వరుడు నీకెందుకు? ఉన్నదంతా అయిందిగా! ఇహ వాడు పైకిరావడంకల్ల. ఇప్పుడునేను యీ యింటికి అధికారిని. రా — నాతోఉండు. నాహృదయ రాణిని చేస్తాను. నీ కేలోటూ రానివ్వను. నాసర్వస్వం—

లీ :—అన్నా! మాయచేసి వంటరిగా తీసుకొనివచ్చి యిలా మాట్లాడడం నీకు న్యాయమా! నీవు నా సోదరుడవు.

కే :—ఉష్! నీ పాతరోజులు జ్ఞప్తికి తెచ్చుకో! కులటకుపుట్టిన నీలో ఆ రక్తమే ప్రవహిస్తుందని నాకు తెలియదనుకొన్నావా? నాకండ్లు కప్పి పారిపోచూడకు.

లీ :—ఛీ! వెధవా! ఒళ్లుతెలుసుకొని మాట్లాడు.

కే :—అబ్బో! నీతిట్టులోకూడా అందం కనబడుతోంది.

లీ :—పశువా !— మాయచేసి—

కే :—ఇదిగో ! నా మాటలను ముందుగనే అల్లరిలేకుండా విను—

లీ :—లేకుంటే ?

కే :—కామంతీర్చుకోడానికి రాక్షసకృత్యం...

[వికటంగా నవ్వుతాడు.]

లీ :—నీచుడా ! ..ఇంతటి అవినీతికి వడిగట్టుతావా ? యిష్టంలేని స్త్రీతో పొందుకోసం ప్రయత్నించడం పశుత్వంకదూ !... జంతువువా ?

కే :—ఇహ నీపతివ్రతాత్వం ప్రక్కనుపెట్టి...

లీ :—అయ్యా !... నన్ను రక్షించండి. కాళ్ళంటి ప్రార్థిస్తూన్నాను. ఒకరి ఆలినైన నన్ను భంగపరచడం ధర్మంకాదు. ఓక్షణిక సుఖం కోసం నా జీవితాన్ని ..నా సతీధర్మాన్ని పాడుచేయకండి—

ఉ. అన్నవటంచునమ్మి మన । మారడిబుచ్చగ భర్తజూడగా
క్రన్ననరేగుదెంచితిని కామవశంబున మోసమెంచుచుఁ
మన్ననసేయుచూడ నిది ! మాన్యులుమెత్తురె ? యిట్టిచేష్టలా
పన్నను నన్ను దూరుటలు । పాపము ! చెల్లదునీకు సోదరా !

కే :—ఓ ! నాకుతెలుసు నీవైరాగ్యం. పెండ్లి కాకముందు నీ బిజినెస్ ఏమిటోయ్ !...నీ యానాన్ని మార్చుకొని జీవించడమేగా !...

లీ :—కఠిక వెధవ ! నీకు హృదయంలేదూ !— అది పాషాణమా ! నా బొందిలో ప్రాణం ఉన్నంతసేపు నీక్రౌర్యం నీవు నాపట్ల సాగించలేవు. కుక్కకంటే అధమబుద్ధితో చరింపచూస్తూన్నావ్ !

కే :—[నిర్లక్ష్యంగా] ఎవరూ చూడరులే! నేను ఎవరితోనూ చెప్పనుకూడా. నీ శ్రీరంగనీతులు ఓప్రక్కపెట్టి యిహాప్రక్కకిరా! తరువాత నీభర్తను చూపుతాను.

లీ :—మీకు నమస్కరిస్తాను. నా భర్తను చూపండి. నా సతీ ధర్మాన్ని నాశనం చేయకండి. నా పాతివ్రత్య వ్రతాన్ని పాలించ నివ్వండి.

కే :—చూడూ! పరమొగాడ్ని చూడకపోతే పతివ్రతే కాదని మన పురాణాలే సాక్ష్యం యిస్తున్నాయి. నా మాట విను!—

లీ :—నీచుడా!— పురాణ ధర్మాలకే కళంకం ఆపాదిస్తూన్నావా?

కే :—పురాణ సూత్ర రహస్యాలు నీకు తెలియవు కాబోలు!— చంద్రుడ్నిగూడి తార, వాలినిగూడి మండోదరి, ఇంద్రుడ్నిగూడి అహల్య, సూర్యుడ్నిగూడి కుంతి మేటి పతివ్రతలు అయినారంటే పర మగాడినికూడిన పరమరహస్యం వల్లనే! తెలిసిందా? నాతో కూడేవంటే ఒకటోరకం పతివ్రతవై పోతావ్!—సినీమా పతివ్రతలు కూడ నీ కాలిగోరుమీరాంచి బలదూర్!—కమాన్!—నాతో ఉండు టు లివ్ యిజ్ టు లవ్ (*To live is to love*) అన్నాడు ఒక యింగ్లీషు కవి. రా!—

లీ :—[యోచనా దృష్టితో నిమిషం ఆగి] సరే... భోజనమైనా లేని నన్ను ఇలా నిర్బంధించ చూడడం......

కే :—ఓ. కే. (O. K.)— అలా దారిలోనికివస్తే సంతసం. ఇదిగో— యిప్పుడే కావలసిన భోజనం రప్పిస్తాను. యిప్పటివరకు నాప్రేమను కనిపెట్టడానికి వేసిన ఎత్తుకదూ!—వెయిట్! [అంటూ తూలుతూ బయటికి వెళతాడు. లీల తలుపులు బిగించివేస్తుంది]

లీ :—అమ్మయ్యా!...ఈ దుర్మార్గుని బారినుంచి ప్రస్తుతం తప్పించు కొన గల్గాను. ఇహాలోనికి రాలేడు. [ఆతృతతో] తలుపులు పగలగొట్టి ప్రవేశించునేమో?...అదిగో [చెవియొగ్గి] యిూప్రక్క గదిలో చప్పుడవుతూంది. ఈ తలుపులు తీసి నన్ను రక్షించమని వారి కాళ్లమీద పడతాను.

[లీల లోనికి పోతుంది. వెనుకసీను లేస్తుంది]

[రేవతి డ్రాయిరుమీద కూర్చొని యోచిస్తూంటుంది. లీల పరుగెత్తుకొని వస్తుంది. లీలను కోప దృష్టితో చూచి, రేవతి ప్రక్కకు దృష్టిమరలిస్తుంది]

లీ :—[దైన్యంగా] అమ్మా!...నేను ఒక యింటి ఇల్లాలను. నన్ను మాయచేసి ఒకాయన యీ యింటిలోనికి తీసుకొనివచ్చి నన్ను బలవంతపరుస్తూన్నాడు. నన్ను రక్షించరూ!... [కాళ్లుపట్టుకుంటుంది]

రే :—[నిర్లక్ష్యంగాచూచి ఊరుకుంటుంది]

లీ :—అమ్మా! నన్ను రక్షించవూ!...నామానప్రాణాలు యిప్పుడు నీచేతిలో ఉన్నాయి. తల్లీ!—నా సతీత్వాన్ని కాపాడవూ!...

రే :—[నిర్లక్ష్యంగాలేచి నిలువబడి] నేనెవరినో నీకు తెలుసా?

లీ :—ఎన్నడూ చూచినట్లుగురుతు లేదుతల్లీ...

రే :—ఎవరినో త్వరలోనే తెలుస్తుంది.

లీ :—అమ్మా!—ఆతని బారినుండి రక్షించి నన్ను బయటకుపంపు మార్గం యోచించవూ?—

రే :—అలా జరగడానికి వీల్లేదు.

లీ :—అమ్మా! నీతోడిస్త్రీ, రాక్షసకృత్యానికి బలిఅవుతూంటే చూచి ఊరకొనగలవా? సహాయంచేయ కలిగిఉండికూడ నిర్దయవూనడం న్యాయమా! తల్లీ—రక్షించవూ! నీ పాదములు విడువను. నాకు మాన బిక్షపెట్టి కాపాడు. మాట్లాడవూ!—నేనేమి అపకారం చేసేను తల్లీ!—

రే :—నీవు చేయకపోతే నీభర్త చేశాడు. ఎవరైతేనేం? నా ప్రతీకారానికి!

లీ :—నా భర్త ద్రోహంచేశారా!— అట్టివారు కాదే!—అదిఎలా జరిగింది!

రే :—మొదటిలో ప్రేమచూపి, నన్ను నమ్మించి యిప్పుడు తృణీకారంచూపి నన్ను కులటనని దూషించాడు. అందులకుగాను ఆతని కండ్లఎదుట నిన్ను కులటనుచేసి విడువడమే నా యిప్పటి నిశ్చయం.

లీ :—అది నిజమేనా ?

రే :—ఆ !—నిజమే. నీపెదవులతో ఆతన్ని మధురపరచి, ఆతని మెత్తని హృదయంలో విషాన్నిచిలికి, నాకు గాకుండ చేశావు. అట్టినిన్ను చూచినేను ఏలాసహించి ఊరుకోగలుగుతాను !— నీవు కులటవైనప్పుడే ఆతడు క్షోభించి తీరుతాడు. అది ఆతనికి జన్మాంతరం తీరనివ్యథ ఆతని క్షోభ నా సంతసం సమానపరిమాణంలో పెంపొందాలి. అప్పుడుగాని—

లీ :—[ఆతృతతో] అక్కా !—ఇదేం న్యాయం ! నేను నీకు ఏమి అపకారం చేశాను ! ఆయనచేసిన ద్రోహానికి నేనా బాధ్యురాలను ? ఏపాప మెరుగని నామీదనా నీప్రతీకారం ? అక్కా !— సాటి స్త్రీవే—నీచెల్లెలి మానాన్ని మరియొకడు హరిస్తూంటే చూచి సంతసిస్తావా ?—అక్కా !—ఆయన నేరానికి నన్ను యితర వ్యక్తి చేతికి అందించడం ధర్మమా !—

రే :—ఆ ! అలా జరిగితీరాలి. మోహనుని పరితాపం నా కండ్లముందు కనబడాలి తిరస్కారానికి నేను చేసిన అపరాధం మాత్రం ఏముంది ?—

లీ :—[దుఃఖంతో] అక్కా !— నీకోపం తీరడానికి నీ చెల్లెలన్ను నీ కండ్లముందు కాల్చివెయ్యి ! సంతసంగా నీకోసం ప్రాణం విడుస్తాను. నీకోపం తీరేలా నన్ను చిత్రవధ చెయ్యి ! కాని ఆమానవ రూప పిశాచానికి ఎరగా నన్ను ఎసురవెయ్యకు. అక్కా ! నీ

సోదరిని కాపాడవూ! అక్కా...అక్కా...నా వైపు చూడవూ! అవును—నాదే ద్రోహం—నీపట్ల ద్రోహమే చేశాను. నీచేతులతో నా ప్రాణాలు తీసివెయ్యి అక్కా!—నీ పాదములంటి ప్రార్థిస్తాను. అక్కా!...

రే:—[జాలిగా ఆమె వంకచూస్తూ తనలో] నా హృదయంలో మండే అంతద్వేషమూ నీరై చల్లబడుతోంది. ఈమె మాటలకు నాలో జాలి కలుగుతోంది.

[కేశవరావు తూలుతూ ప్రవేశం]

కే:—ఓ! యిక్కడికి దయచేశావా? ఇలారావేపిల్లా! [చెయ్యి పట్టుకోబోతాడు]

లీ:—[రేవతి పాదాలదగ్గర కూర్చొని కంగారుతో] అక్కా! అక్కా!—

రే:—[నిలువు గుండెతో] రావుగారూ! ఈమెను వదలి బయటకు వెళ్ళండి. [అంటూ లీలను దగ్గరకు తీసుకొని తల నిమురుతుంది.]

కే:—ఓ! ఆజ్ఞ కాబోలు! చిత్తం—యీ విషయంలో తమరు శ్రమ తీసుకోవద్దని నా కోరిక.

రే:—రావూ! ఆమెను ముట్టడానికి వీల్లేదు. ఈమె నా చెల్లెలు. నా స్వాధీనంలో యున్న ఈమెను సమీపించడానికి...

కే:—ఇహ నీ ఆజ్ఞలను అంగీకరించువాడను కాదు. నీరహస్యములు నాచేతిలో వున్నాయి. అవి బహిరంగ పరచితినా నీస్థితిఎట్లు మారునో యోచించుకో! నా వాంఛకు అడ్డుతగులకు. దాని అందాన్ని త్రాగి తృప్తిపడువరకు—.

రే:—[కోపముతో] ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా?—

కే:—ఆ! ఒక రహస్యవ్యభిచారిణితో—

రే :— నా యింట్లో చొనిస్తవై నా సౌమ్ముతిని—

కే :—చఫ్ ! బయటకు నడు ! నీవు నాచేతిలో యిరుకుకొన్నావని కూడ గ్రహించుకో !—

రే :— వెధవా ! ఆమాత్రానికే భయపడతానని తలుస్తున్నావా !— ఒళ్ళు తెలసుకొని ప్రవర్తించు.

కే :— పాముతో చలగాటంకాదు. నాప్రయత్నానికి ఎదురునిలువకు. దాని ప్రతిఫలం పొందసాహసిస్తే—

రే :—త్రాగుబోతా !—నోరుమూయ్యి !—

కే :—అనే—రేవతీ !—

రే :—[కోపంతో ముందుకు నడచి] శాస్త్రిగారూ !— శాస్త్రిగారూ! ఒక్కమారు యిలారండి. ఈ కేశవరావు నాగదిలో ప్రవేశించి నిర్బంధ పరుస్తూన్నాడు.

[రామశాస్త్రి ప్రవేశం]

రా :—[కేశవరావును చూచి నిర్ఘాంతపోతూ] ఇదేమిటి !—ఏమోయి పంతులూ !— యీ రాత్రివేళ—నాయింటిలో—

కే :—[నిర్భయంగా] ఆ ! వచ్చాను. రేవతిరమ్మంటే వచ్చాను.

రే :—నోరుమూయ్యి !—నేను రమ్మనడమా !

రా :—ఆరి నీత్రాడుతెగ ! ఎంతబరిదాటి మాట్లాడుతూన్నావురా ! పైగా నా పెళ్ళాం నిన్ను రమ్మందని కూడ అంటున్నావురా ! ఆరి నీ కొంపమీద బాంబులుపడ ! దాని సంగతి కాపురం చేస్తూన్న నాకు తెలియదటరా!— [నోరు నొక్కుకొని] ఓరి పోకిరీ గాడిదకొడకా—చూస్తూండగనే నాయింటిమీదకు హీట్లరవై పోయావ్ !—

కే :—[తూలుతూ] ఓ సరుకుతక్కువ సన్యాసీ!— నీ పడుచుపెళ్ళాం మాటలు విని మోసపోకు ! దాని మాటలమీదనే యిక్కడికి

వచ్చాను. మోహనుణ్ణి కూడ రప్పించుకొని పైగదిలో పరుండ బెట్టుకొంది. వెళ్ళిచూడు!

రే :—త్రాగి మాట్లాడుతున్నాడు. రోడ్డుమీద ఉన్న రక్షకభటులను కేకవెయ్యండి! వీడికథ కనుక్కుంటారు. నిష్కారణంగా యీమెను యీగదిలోపెట్టి బలవంతపరుస్తూన్నాడు. ఊ! వెళ్లండి. [అని రేవతి హెచ్చరించగనే శాస్త్రి లోనికిపోయి రక్షకభటులను కేకేస్తాడు]

[పోలీసు యినస్పెక్టరు రక్షకభటులతో ప్రవేశం]

ఇన్స :—ఏమిటీ అల్లరి?

రా :—ఇదిగో! వీడు నాగుమాస్తా. వీణ్ణిముందు బంధించండి. యీ రాత్రివేళ నాయింటిలో దూరి త్రాగుడుమైకంలో ఒళ్లు తెలియకుండా నా భార్యను బలవంతపరుస్తున్నాడు.

ఇన్స :— అరేయి! వీడిని పట్టండ్రా.

[కేశవరావును రక్షకభటులు పట్టుకొందురు.]

కే :—[భయంతో] ఒక నిమిషం ఆగండి. ఇదిగో శాస్త్రిగారూ! వినండి. ఈకృత్యానికి కారణం నేను కాదు— అదిగో ఆ స్త్రీ రూప రాక్షసియే! [అని రేవతిని చూపుతాడు] ఈమె మోహనుని ప్రేమించి ఆతనిని కోరగా, ఆతడు న్యాయబుద్ధితో యీమె ప్రేమను తృణీకరించాడు. అది కోపంగా పెట్టుకొని ఆతన్ని ఫకీరు చేయ తలంపుతో మీకు ఏదో మిషచెప్పి ఆతని వర్తకానికి మీ ద్వారాదెబ్బ తినిపించిన చతురత ఈమె ఇప్పుడు నాద్వారా మోహనుణ్ణి త్రాగించి పైగదిలోపరుండబెట్టింది. ఆతని భార్యయగుయీమె శీలాన్ని పాడుచేయమని నన్ను ప్రోత్సహిస్తూ, ఆపనులలో కృతనిశ్చయుడనైతే ఆమె నా దాననని కూడ ఆశచూపింది.

మిమ్మల్ని వదల్చుకోడానికే. దాని ప్రయత్న మంతానూ! కావలిస్తే పై మేడమీాద చూడండి. మీాకే స్పష్టపడుతుంది.

రా :—[ఆశ్చర్యంతో దృష్టిని రేవతివైపు మరలిస్తాడు.]

రే :—[ధీమాతో నిండిన చిరునవ్వుతో] ఆ! నిజమే! ముసలి వాడవే! ఏండ్లునిండి కాటికి కాళ్ళుచాచుకొని కూర్చున్న నీకే అంత మమకారం ఉంటే తన సౌందర్య ప్రతిభాలాభాన్ని పొందాలనే స్త్రీ సహజమైన ఆసక్తి నాలోకూడ మేల్కొ-వడం నాదే నేరమౌతుందా?

రా:—ఆ!— ఆ!! ఏమిటన్నావ్?—

రే :—[కండ్లలో కోపం కనబరుస్తూ] వారి సౌఖ్యంకోసం ఎదుట స్త్రీ జీవితం బలికావలసిందేనా! ధనమదాంధతతో డబ్బుయిచ్చి కొనుకో-వడంతో ఆ స్త్రీ తనదవుతుందా! శరీరాన్ని కొనుక్కుంటే హృదయాన్నో? భార్యల్ని గొడ్లగా — శవాలుగా నగలు మోసే కొయ్య బొమ్మలుగా చేసుకొని తృప్తిపడడమేనా మీాకు కావలసింది! ఆయంత్రం వారి స్వాధీనమై వారిఆధీనంలో అవసరమైనప్పుడల్లా సిద్ధంగాఉంటే చాలుకదూ! సమస్త ఆశయాల్ని, ఔన్నత్యాల్ని, జీవితంలోని ఆనందాన్ని సంపూర్ణంగా నాశనంచేసి పశుప్రాయంగా ఉపయోగించుకోవడమేనా వారికి కావలసింది!

రా :—ఆసిముండా! ఎంతబరితెగించి మాట్లాడుతున్నావ్!

రే :—ఆ! నా హృదయం వేదనతో కుమిలిపోతూంది. నావలెనే నిర్బంధనచే ముసలిభర్తను కట్టుకొన్న స్త్రీ వ్యభిచరించిందంటే ఆతప్పు తనదే అవుతుందా? ఏ స్త్రీకి కోరికలు ఉండకపోతాయ్! ఏ స్త్రీ ఏండ్లునిండిన తండ్రివంటి భర్తతో కాపురంచేయ నిచ్ఛ

గిస్తుంది. వ్యభిచారం పెంపొందిందంటే ఇది కారణం కదూ? ఏం! స్త్రీ వివాహవిషయంలో ఎడతెగనినిబంధనలు చూపేసంఘం ముసలిపందల వివాహానికి అడ్డుపరచు నిబంధనలు చూపలేదేమి? శారదాబిల్లు అనుపేరుతో వయసువచ్చిన పిల్లకే పెండ్లని తీర్మానించేరుకాని, ముసలిపందలు వివాహానికి అర్హులుకారనే తీర్మానం ప్రభుత్వంవారు అయినా గమనించి చట్టనిర్ణయం చేయలేదేమి? నా వంటి స్త్రీలు ముసలి భర్తలతో గోలుగోలని ఏడుస్తూ తమ జీవితాల్ని ఎంతమంది భగ్నపరచుకొంటున్నారో తెలుసుకోనక్కరలేదా!—[శాస్త్రివంకచూచి]

ఉ. 'ఏజి' బొటాబొటీగ పదునేనయియుండెను బాలనైననన్
వ్యాజముచేత నేకద వివాహమునాడితి వృద్ధమూర్తివై
సాజనరూపసర్ప! మనసారగ ప్రేముడిలేని బొందెతో
నీజగతిన్నెవండు సుఖయింపగ గల్గును? మూర్ఖచిత్తమా!

ఇదిగో! నీవంటి ముసలిభర్తలకు నాసందేశం.-[అంటూ లోనికివెళ్ళుతుంది.]

రా:—[తనలో] ఇది ధర్మనిర్వాహణ చేస్తుందనుకొన్నాను గాని యీలా మోసాన్ని పాలిస్తుందనుకోలేదే!—

[రేవతి తిరిగి ప్రవేశిస్తుంది]

రే:—ఇదిగో! నాబోటిస్త్రీలకు మార్గదర్శకురాలనై యీప్రపంచాన్నే విడుస్తూన్నాను. [లీలను దగ్గరకు తీసుకొని] చెల్లెలా! నీవు ధన్యురాలవు. కులటసంతతిలో నీతినియమము లుండవని అనుకొనే సంఘమునకు నీ వేకండ్లు తెరిపించి నిజాన్ని చూపగలిగావు. అమ్మా! నీవుసాధ్వీమణివి. నీయెడల నేను గావించిన తప్పులు క్షమించు. యీ కేశవరావుచేత నడిపించిన నటనకు నేనే కారణం. ఇంకాకొన్ని నిమిషములుమాత్రం ఈప్రపంచాన్ని చూడగలుగు

తాను. లోపలవిషం అప్పుడే తలకెక్కుతూంది. అమ్మా! మోహ
నునకు నీవే తగినభార్యవు. ఆతనితో కూడ నాఅపచారములను
క్షమించమని తెలియచెయ్యి. తనపైగల అప్రేమే నన్నీ విధంగా
మార్చింది. అబ్బా!—

[అని నెమ్మదిగా నేలమీదకు ఒరుగుతుంది]

లీ :—అక్కా!...అక్కా!... నన్ను విడిచిపోతూన్నావా ?...
అక్కా! నీప్రేమకు అడ్డుపడిన దాననునేను. నన్ను శిక్షింపవేమి!
జీవితాంతం నీకోసం...నీసహృదయంకోసం తీరని వెత చెంద
మనియా! ఈవిడువని శిక్ష నాకుచుట్టి నీప్రతీకారాన్ని చెల్లించుకొన
చూస్తూన్నావా? అక్కా!...

(మోహనుడు ప్రవేశం, అక్కడివారి నందరినిచూచి, పడిఉన్న రేవతిని, దగ్గర కూర్చున్న లీలను చూస్తాడు)

మో :—[ఆశ్చర్యంగా] రేవతీ!...ఏమిటా నోటివెంట సొంగలు!—

లీ :—[ఆతృతగా] అక్కా!...ఇదిగో మోహన్‌వచ్చారు...చూడు!
ఒక్కసారి చూడు...

రే :—[కండ్లు తెరుస్తుంది] చెల్లెలా! విచారించకు. నన్ను పోనియ్యి.
అప్పుడుగాని నాహృదయానికి శాంతిచేకూరదు. మోహన్!...
నీచెయ్యి ఒక్కసారి ఏది!...

మో :—[దగ్గరగాచేరి] రేవతీ!.. ఏమిటీ దుస్థితి!...

రే :—నేనుమాట్లాడలేను— అంతా నాచెల్లెలు చెప్తుంది—ఊ—
ఈమె నాచెల్లెలు— అంతేకాదు— నాప్రతిరూపంకూడ—

మో :—రేవతీ!— నీవు—

రే :—అమ్మా! బాధ!— బాధ!— ఉష్!— కడసారిమాట విను—
ఊ...నీకోసం...నీతోనే అంత్యమాటలు చెప్పడానికి కొనఊపి

రితో ఉన్నాను...ఊ...నీకష్టాలకూ నీబిజినెస్ తారుమారు అయి నీవీగతికి రావడానికి కారణభూతం నేను...ఊ...ఈరావును సహాయంగాతీసుకొని నిన్ను వెంటాడాను...ఊ.. నీభార్యను అసూయచే చెరప చూచిందినేను...శీలంకోసం చివరకుప్రాణమైనా యివ్వసమకట్టిన సాధ్వీమణి నాచెల్లెలు—ఊ.. ఈనాచెల్లెలిని... నాచిట్టి చెల్లెలిని కష్టపెట్టాను. మీకలయికయే నాసంతసానికి కారణమౌతోంది...నాకోసం విచారించకు...అబ్బా !...పది... మీచేతుల్ని...

[లీలా మోహనుల చేతులు తీసుకొని కలుపుతుంది]

మో :—[దుఃఖంతో] నిన్నీగతికి తీసుకొనివచ్చింది నా కఠినత యేనా !—రేవతీ !—ఎంతటిసాహసాన్ని తలపెట్టావు ! నీకన్నీటిధారలు త్రాగిత్రాగి దాహాన్ని తీర్చుకొన్నాను. తుదకు నీ రక్తాన్ని...ప్రాణాన్నికూడ చవిచూస్తూన్నాను.

రే :—ఉఫ్...విచారించకు మోహన్ ! నాచావుకినీవుసంతసించాలి. ఊ...అబ్బా !.. నా ప్రాణం శాంతిగాపోనియ్యి.. నీవు విచారపడకు. నా ప్రతిరూపమే యీ లీల...అబ్బా—అబ్బా— మోహన్—సెలవు—సెలవు. [కండ్లుమూస్తుంది]

శా :—[పశ్చాత్తాపంతో] ఈరంగానికి కారణంనేను. కామాతురుణ్ణయి—పశువునై—యిష్టములేని బాలికను బలవంతముచేసి యీ వయస్సులో హృదయంలేకుండ వివాహమాడేను. నా హృదయ భాగాన్ని వేరుచేసి కాల్చివేసినా నేను చేసిన అఘాయిత్యానికి తగినశిక్ష కాదనుకొంటాను. పెండ్లికోసం వెతకేముసలి పీనుగుల మొహంమీద చెంబుడు పాణ్ణీళ్ళు కొట్టినట్టు గుణపాఠం చెప్పిపోయింది పరలోకానికి యీ పరమపావని. [చెంపలు వాయించుకొని] బుద్ధివచ్చింది. నాబోటి బుద్ధిహీనులు తెలుసు

కోవలసిన విషయమేమిటి...ఇదిగో...మోహన్ !...నా ఆస్తి అంతానీవే అనుభవించు నేను కాశీపోయి మోక్షంకోసం సన్యసిస్తాను. విధివశమున కులటలైన సంతతికి చేయూతనివ్వడానికి ఒక ఆశ్రమాన్ని స్థాపించు. వీలుగాఉంటే ముసలి పీనుగుల వివాహాల్ని అరికట్టు సాధనంకోసంకూడా ప్రయత్నంచెయ్యి. నువ్వా విద్యావంతుడవు. గాన ఆ ఆశ్రమానికి నీవేశ్రకటరీవై దానిని జయప్రదంగా సాగించు. ఈ కేశవుని పాపం మనకెందుకు? ఆతనిని విడచిపుచ్చండి...

మో :—మహా ప్రసాదం. [ఎదుటకువచ్చి]

సీ. భర్తశవమున మంటబడవైవ కుండగ
రామమోహనరాయి రక్షజేసె
పతిలేక గతిలేని పడతికష్టము బాపె
వీరేశలింగాఖ్య సారయశుడు
విద్దె బుద్దియులేని ముద్దియల కొఱకునై
సద్విద్యనిడె రాజశాసనంబు
మాత దుశ్చారిత్రమైన కూతురులను
ప్రేమజూపుట ధర్మమన్ వీరుడెవడొ ?

గీ. పాపులగు వారిచేతులన్ పడియు తనదు
శీలమింతేని చెడని సుశీల లీల
శరణ మిచ్చితి సంఘసంస్కారుల్గార !
ఇట్టి శరణాలయమ్ము నిర్మింప రండు.

[తెరపడుతుంది.]

సంపూర్ణము.



# అనుబంధములు



1—వ అనుబంధం. దైలాగు శివరంజని—జంపితాళం.

రేవతి:-1. ఈ మావిగున్నపై—ఈవు కూ—కూ యంచు
ఆ మావిగున్నపై—ఆపి కూ—కూ యంచు
ఏమి పలుకుచు నుంటివే—కోకిలా!
ఏమి పలుకుచు నుంటివే—కోకిలా! ॥ఈమావి॥

2. పరులు చూచిన నిన్న—పరిహాసములు చేసి
పరువు తీయుదురన్న—భయము లేకను వలపు
కులుకులాడుట చెల్లునే—కోకిలా!
పలుకులాడుట చెల్లునే—కోకిలా!

3. చెలియతో నీవంత—చివురు కొమ్మల కెక్కి
చిలుక కోరింకవలె—చిలుకంగ గానమ్ము
చింత నీకే మున్నదే—కోకిలా!
వంత నీకే మున్నదే—కోకిలా!

మో:—4. చెంత చెలియయు గలిగి—నుడువ భాషయు తెలసి
ప్రియురాలి ప్రేమంపు—పాట వినవోచని నా
చింతలెన్నడు దీరునే—కోకిలా!
చెంత నెప్పుడు నుందువే—కోకిలా!

రే. & మో:—5.

పాడవే కోకిలా—పాడవే యింపుగా
ప్రణయగీతాలచే—పరవశుల చేయగల

పాటపాడవె తీయగా—కోకిలా !
పాటపాడవె హాయిగా—కోకిలా !

2—వ అనుబంధం. డైలాగ్ మాండురాగం-ఆదితాళం.

రే :— 1. హాయి.........
హాయి.........
హాయి...హాయి...హాయి
హాయి...హాయి...హాయి
ప్రియసఖా-ప్రణయజలధిన్-దాటగా తరమౌనా !
పండువెన్నెల రేయి-ప్రేమికులకు-మది-హాయి, ఓయీ !
పండువెన్నెల రేయి-ప్రేమికులకు-మది-హాయి, ఓయీ !

మో :—2. నీవు నేను- సురవన- నవ సుమమై
తావు లీనుదము- ధరగల దాకా
రే :— 3. ప్రేమలోనే- జీవితాశ గదరా
ఎవరేమననీ- ప్రణయమె మనదీ
మో & రే :—4. ప్రేమయే- నా- జగతీ.

3—వ అనుబంధం. మాండురాగం-ఆదితాళం.

లీల :— 1. వేదకులేదా- జగతిని త్రోవ
లోకములోన- న్యాయమే లేదా !
2. దోసములేకే- హేళన జెందు
గ్రాసములేకే- గాసిలి జెందు ॥వేద॥
3. మానమువిడచీ- మానము దాల్చి
పాటుపడినను- ఫలమే లేదు. ॥వేద॥

4—వ అనుబంధం. తిలకామోడ్ రాగం-జంపితాళం.

లీల :— 1. దేవదేవ కృపాజలనిధే
జీవకోటిపై నీకెంత ప్రేమా ॥దే॥

2. కులట అయిన ఏద్రోహియైన
ఎవ్వరైన తానే మార్గమైన
అనుసరింప నీయందే లీనమౌ ॥దే॥

3. నీమములేని జన్మ వ్యర్థమేకాదా-జన్మ ॥దే॥

5—వ అనుబంధం. మాండుమిశ్రమం-ఆదితాళం.

రే :— 1. విరజాజులేర నా- వాలారు గోటితో
విరల సరుల కొరకునై-సరసిజాక్షు సౌమ్యతేజా
పరమ పురుషుని- చరణములా
గన గనే.........చనుదునో ॥విరజాజు॥

2. మనసులోన హరినీ-దలచినేను వలచీ
కోరిన వరునిగా-ఒసగుమా కరుణా
దేవు నభవు గొలుతు-నీ దినమునగా
మానసమును నే.........
మానసమున మరువా-మరువా ॥విరజాజు॥

6—వ అనుబంధం. భీమపలాస్-ఆదితాళం.

మో :—1. ఏలనె యీ నిరాశ నిరాశ ॥ఏల॥
నీమదిలో-బేలా-లీలా ॥ఏల॥

2. పావన భావవిశాలా- గుణ
పారము నీకిదె బేలా ॥ఏల॥

3. కరుగు నీజాలిచే పాషాణమైన
నీశీలముగన దైవములేడా. ॥ఏల॥

7—వ అనుబంధం. డైలాగ్ బేహాగ్-ఆదితాళం.

లీ :— 1. నీవేగా-ఈరూపమూ
నీవేగా-నాజీవమూ
పూవులు నేనేగా-కమ్మని-తావులు నీవేగా

మోహన్ :—2. నావలపులు తలపులునీవె
నాహృదయ కుసుమమవు కావె

లీల :— 3. నీరాణిని నేనేగా...

మో :—4 నీరాజును నేనేగా...

లీ & మో :—5. రాగసుధా- అనురాగసుధా-గన
భరింతంబగు-మన ప్రేమా
మరువగా తరమే-మరువగా తరమే ॥నీవేగా॥

8—వ అనుబంధం. ఝూంఝూ గజ్ఝ-దాద్రాతాళం.

రే :— 1. చూచి ఆనందించవోయీ-నాసొగసు
దోచుకొందుకు దొరకదోయీ-నామనసు ॥చూచి॥

2. మురియూ బోకోయీ-దరియూ రాకోయీ
ఇది విరసిన-విరజాజి-విరసిన విరజాజి ॥చూచి॥

3. నింగి నెగబ్రాకుటకిది-నిచ్చెనకాదోయి
చూపుల బడినంతనె-నీచే బడదోయీ
చెల్లదు నీకా-చెనుగు తలంపు
వెంటబడకోయి-యిదియింద్ర ధనుస్సు ॥చూచి॥

9—వ అనుబంధం. కాఫీ-దాద్రాతాళం.

లీల :— 1. మదిలోనీ ముద మేలా
ప్రియుడుపలుకు పలుకులలో గలలీలా ॥మది॥
2. పతియెగదా భావింపగ
ప్రాణములో పడతికొర
వలపులలో గలశోభే వనిత జీవమాగాదే
ఇదే కదా ప్రేమములో గలలీలా
తలపులి వే-వలపులి వే-కలలుని వే-పలు కేలా ॥మది॥

10—వ అనుబంధం. దుర్గరాగం-ఆదితాళం.

ప్రతీకారధాటీ । నాప్రతీకారదీక్షా ॥ప్రతీ॥
ఈశుడైన, లోకేశుడైన, పురు
షాగ్రగణ్యడెవ్వడైనగానీ।
అవనిని, నిలబడునా ? తనివిని తలపడునా ? ॥ప్రతీ॥
సుమసమ మగుయీా । రేవతి హృ
దయము । అతికఠినపు పాషాణ
ప్రాయమని । ఎరుగ వాకో ?
నీకును తెలియ దోకో ?
నీదుసతిని నేను కులటఁజేసెద ॥ప్రతీ॥

11—వ అనుబంధం. భాగేశ్వరి-ఝుంపితాళం.

మో :—1. సంఘుమెడత్రోయనీ-సంపదల్ తొలగనీ
కన్నీరువిడువకే-కలుషమెరుగని చెలి
ఆడవే-పాడవే-హాయిగా నాచెలీ !

2. ప్రకృతీరంగమున-ప్రళయ నాటికలోన
యిరువురము ఏకమై సంఘుసంస్కరణకై
ఎన్నియిక్కట్లైన ఎదిరించి జయమంది
జయజయధ్వనులతో జయభేరిమ్రోగించి
ఆలపింతము మన ప్రేమగీతికను
ఆడుచూ పాడుచూ హాయిగా నాచెలి ॥సంఘు॥

12—వ అనుబంధం. భైరవి-ఝుంపితాళం.

నీ చరణములె సదా
నే గొలిచెదను దేవా
నీ పూజలనె జేసి
తరియింతు ప్రభువా
కఠినతయె లేదంద్రు
గదె నీదు హృదయమునా ॥నీ॥

నా జీవితంబులో
నా మనోహరు మేను
నా బాహువల్లిలో
నెపుడైన మరల వ్రాలునా
నా ప్రేమసుధలో తేలునా ॥నీ॥

